## కృతజ్ఞత.

ఈ గురుదేవ చరిత్రము రచించుటలో నాకీ క్రింది గ్రంథము లుపకరించినవి. ఏతత్కృతి కర్తలకు నాకృతజ్ఞతా పూర్వక నమస్కృతులు.

1. Rabindranath Tagore – By Marjorie Sykes.
2. Rabindranath Tagore Poet and Dramatist – „ Edward Thompson.
3. Rabindranath Tagore A Philosophical study „ Vishwanath S.Naravane.
4. Rabindranath Tagore The poet Laureate of Asia (Ramulu's pamphlet).
5. Sir Rabindranath Tagore. (Natesan & Co Publications)
6. The Golden Book of Tagore.

మో. రా. కృ.

శ్రీ

# గురుదేవ చరిత్రము

## ప్రథమోల్లాసము

భారతమాతకు విద్యాగౌరవము కవిత్వకీర్తి ఖండాంతరవిస్తారముగా సమకూర్చిన ధీరుల ధామములు దివ్యతీర్థములుగదా! అట్టి పుణ్యమూర్తుల కనేకులకుఁబుట్టినచోటుగా వన్నెకెక్కిన పట్టణము కాళీఘట్టము. అది పురాతనమైన పురవరేణ్యము. గంగాసాగర సంగమస్థానముగాఁ గాళీ దేవతాయతనమునకు నెలవుగా, పూర్ణవాణిజ్యమునకు నిలయమై వెలసిన యీ కాళీఘట్టమే రెండుమూడు శతాబ్దుల క్రింద ఆంగ్లేయసామ్రాజ్యమున ద్వితీయబృహన్నగరమై విఖ్యాతిఁగాంచెను. రవీంద్రకవీంద్రుని జన్మస్థల మీనగరీలలామమే.

రవీంద్రుఁడు క్రీస్తుశకము పదునెనిమిదివందల యఱువదియొకటవ సంవత్సరమున మే నెల యేడవదినమున జనించెను. అతని తండ్రి దేవేంద్రనాథ ఠాకూరు. పరమపవిత్రమైన జీవితము గడపిన కతమున దేవేంద్రనాథుని మహర్షియని ప్రజలు వ్యవహరించుచుండిరి. కార్యశూరతకును ధైర్యసాహసములకును దేవేంద్రనాథుఁడు పెట్టినపేరుగాఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. రాజా రామమోహనరాయలు స్థాపించిపోయిన బ్రహ్మసమాజమునకు వ్యాప్తి కలిగించిన ప్రజ్ఞాశాలి

యాతఁడే. ఆతని జనకుఁడు ద్వారకనాథుఁడు శ్రీమంతులలో సిగబంతియై సకలభోగము లనుభవించినవాఁడు.

రవీంద్రుఁడు దేవేంద్రనాథునికిఁ బదునాల్గవబిడ్డ. ఇంతే కాదు: కడగొట్టు కొడుకుగూడ. రవికి బాల్యమునుండియు సౌందర్యము నెడ సౌరభ్యముపట్ల మిక్కిలి మక్కువ. అను దినము నిదుర లేచిన వెంటనే యతఁడు గునగునఁ దమ యింటి యావరణములోనికిఁ బరుగెత్తి, యందలి చల్లని పిల్ల వాయువులను మధుర పరిమళములను హాయిగా ననుభ వించెడివాఁడు: క్రొమ్మంచుబొట్టుల ముత్యాల దండలతో మురువులుగుల్కు పచ్చికలపై విచ్చలవిడిగా విహరించెడి వాఁడు. అతనికి వానచినుకులన్నఁ గడుఁబ్రీతి: ఋతువులలో వానకారన్న సంతోషము.

పదునొకటవయేఁటనే రవి పద్యములు వ్రాయుచుం డెడివాడు: వ్రాసి యింటిలోని వారికందఱకు వినిపించుచుం డెడివాఁడు. పెద్ద పెద్ద మాట లుపయోగించుటయే కవిత్వ మని భావించుచుండెడివాఁడు. అతఁడు పద్యములు వ్రాయుఁ వాఁడనుమాట పాఠశాల ప్రధానోపాధ్యాయుఁడు విని యొక నాఁడు తనచేరువకా చిన్నవానిఁ బిలువనంపి, 'యేమోయీ, నీవు రేపు బడికి వచ్చునపుడు నేనిప్పుడు నీకుఁజెప్పఁబోవు కథను బద్యరూపకముగా వ్రాసి తీసికొనిరావలయును' అని యొక్క నీతికథను జెప్పి పంపెను. మఱునాఁడు రవి గురువు గారు చెప్పినట్లే వ్రాసి తీసికొనివచ్చెను. అయ్యవారు చదువు మని యడుగ రవి చదివి వినిపించెను. గురు వభినందించెను. కాని తోడిబాలకులందఱు నిజముగా నాపద్యముల రవియే

వ్రాయఁగలిగెనని నమ్మలేకపోయిరి. ఏదో పుస్తకములో నుండి దొంగిలించి రవి వ్రాసితెచ్చెనని వారు భావించిరి. ఒకపిల్లవాఁడు 'రవి యేపుస్తకమునుండి సంగ్రహించినాఁడో దానిని నేఁదెచ్చి చూపఁగల' ననియుఁ బ్రగల్భించి పలికెను. కాని 'తెచ్చి చూపు'మని లేచి యడిగినవాఁ డొక్కఁడును లేఁడు. అడిగినవాఁడే లేకపోయినప్పుడు, లేని పుస్తకమును దెచ్చి చూపుట యను సంఘటన మింకెట్లు పొసంగును?

నాటక ప్రయోగములు చిన్నతనపు రవిహృదయము నవ్వారిగా నాకర్షించినవి. అతని తోఁబుట్టువులు మందిరావరణమున నప్పుడప్పు డేర్పాటు కావించుచుండిన నాటకములఁ జూచుటకుఁ జిన్నిబిడ్డలను రానీయకుండిరి, కాని వెలుపల నిలువఁబడి రవి లోపలఁ బ్రవర్తిల్లు సంగీతసాహిత్య సంభాషణముల నమితకుతుకముతో విని యానందించుచుండెడివాఁడు. ఒకనాఁటిరేయి వారిభవనావరణ ప్రదేశమున నలదమయంతుల చరితము నాటకముగాఁ బ్రదర్శితము కాఁగా, రవి నిదురింపక పట్టువట్టి మేల్కొనియుండి యందఱితోపాటు నాటకము చూడఁబోయి గాటమైన కుతూహలముతోఁ గూర్చుండెను. మంచినేర్పుతోఁ దమభూమికల నిర్వహింపఁగలిగిన నటకులకొఱకుఁ బ్రేక్షకులు తమమెప్పు చప్పటలేకాక రూకపిడికిళ్ళుగూడ రంగభూమిపై గుప్పుటయు జరుగుచుండిన కాలమది. రవియుఁ దన యన్నలిచ్చిన నాణెములు మంచినటకుల పాటలకు మాటలకు మెచ్చి రంగమున ఱువ్వినవాఁడే!

రవీంద్రుని జ్యేష్ఠ సోదరుఁడు ద్విజేంద్ర నాథుఁడు వేదాంతి: అంతేకాదు, మంచివచనరచయిత యని పేర్వడ్డ వాఁడు. రెండవయన్న సత్యేంద్రనాథుఁడు. ఆతఁడు 'ఇండి యను సివిలుసర్వీసు' లో నొకపదవి సంపాదింపఁ గలిగిన ప్రథమ భారతీయుఁడు. ఇంకొకయన్న జ్యోతిరింద్రుఁడు. ఆతఁడు చిత్రకారుఁడు. అతఁడు సృష్టిచేసిన చిత్రములు నానా దేశములలో వన్నెకెక్కినవి.

జ్యోతిరింద్రుని భార్య రవిపట్ల బహుళవాత్సల్యముఁ జూపి యెంతో కూర్మితో నతని లాలించుటవలన వారిరు వురికిఁ బరస్పరాభిమానము వర్ధిల్లెను. ఆమెచేయు బొమ్మ పెండ్లిండ్లలో రవి పాల్గొనుటయు విందులు గుడుచుటయుఁ బలుమాఱు జరుగుచుండెను. అదను దొరకినపుడెల్ల రవి యాటలను మాటలను బాటలను ఆమెవిమర్శించుచుండెడిది; హేళన చేయుచుండెడిది. 'నా తెలివి తేటలింత గొప్పవికదా యని ఉత్తరోత్తరము నేనుగర్వింప కుండుట కీమెవిమర్శయే కారణము. అది నాయభివృద్ధికి నిశ్రేణిక యైనది' అని రవి పెక్కుతూరులు పేర్కొనినాఁడు.

పండ్రెండవయేఁట రవికి ఉపనయనము జరిగెను మేళ తాళముల గందరగోళము, చుట్టపక్కముల రాకపోకలు, విం దుల సందడి, ద్రవ్యవ్యయము తప్ప ఈకాలపు వడుగులవలనఁ గలుగులాభము శూన్యము. అట్లుకాక రవికిఁ బితృపాదు లుపదేశించిన గాయత్రీమంత్రార్థము మహత్తర ప్రయోజన కారి యయ్యెను. ఉపనయనోత్సవము పూర్తియైన పిమ్మట దేవేంద్రనాథుఁడు రవిని బిలిచి 'నాయనా నేను బోలుప్పూరు

చూడఁ బోవలసిన పనియున్నది; నావెంట వత్తువా?, యని యడిగెను. రవి హర్షాంతరంగుఁడయ్యెను. ఇరువురును బయ ల్దేరిరి. బోల్పూరు చేరిరి. అప్పటికే యచ్చటి 'శాంతినికేత నము' స్థాపితమై యుండెను. ఆ నెలవున నెలకొన్న యాశ్ర మమున వసించుట రవీంద్రుని కెంతో ముచ్చట గొల్పెను. పంజరమునుండి విడివడినపిట్ట యేహాయి ననుభవించునో యట్టి యానందము రవీంద్రుఁ డనుభవించెను.

రవీంద్రునికిఁ బితృభక్తి మెండు. శాంతినికేతనపుఁ దోఁటలో వృక్షముల నీడలఁ దండ్రి యనుదినము ఉషఃకాల మున జపమో తపమో కావించికొనుచుఁ గూర్చుండుట చూచుచుండిన బాలరవీంద్రుని హృదయమున నేవేవో భావ పరంపరలు చెలరేఁగుచుండెడివి. తండ్రిగారు భగవద్ధ్యాన మునకై యాసీను లగుచుండిన ప్రదేశమున రవీంద్రుఁడు కొన్నియేండ్లు జరిగినపిమ్మటఁ బితృస్మృతి చిహ్నముగా నొక రమ్యమైన శిలాఫలకము నాటించినాఁడు. ఆఫలకమున

'అతఁడె నామనుగడ కగును విశ్రాంతి,
అతఁడె నా మనసున కానంద మగును,
ఆతఁడే యగును నా యాత్మకుశాంతి.'

అను నర్థముగల మాటలు — దేవేంద్రనాథమహర్షికి భగ వంతుని పట్లఁగల విశ్వాసము తెల్పఁజేయు చక్కని పలు కులు రవీంద్రుఁడు చెక్కించినాఁడు.

తండ్రిగారితో శాంతినికేతనమునఁ గడపినకాలము రవీంద్రుని జీవితములో నొకప్రధాన ఘట్టము. ఆపట్టు రవీం ద్రుని హృదయమున మాసిపోవని పవిత్ర ప్రభావమును

గట్టిగా నెలకొల్పినది. అదియే క్రమక్రమముగాఁ బెంపొందినది.

శాంతి నికేతనమునుండి దేవేంద్రనాథుఁడు రవీంద్రునితోఁ గొంతకాల మమృతసరస్సున వసింపఁబోయెను. ఆపురమునందున్నంతకాలము దేవేంద్రనాథుఁడు కుమారద్వితీయుఁడై సిక్కుల దేవాలయముల కీశ్వరోపాసనము నిమిత్త మరుగుచుండెడి వాఁడు. వంగదేశపు నూతనాగతులు తమ దేవళమున కేతెంచుట సిక్కుల కతిసంతోష హేతువాయెను. సిక్కుల దైవోపాసనా విధానములు భగవత్ప్రార్థనా గీతములు దేవేంద్రనాథుఁడెఱిఁగి యుండుట వారి కచ్చెరువొదవించెను. ఆ నగరమున దేవేంద్రనాథుని కచిరకాలములో నెందఱో మిత్రు లేర్పడిరి. అన్యమతావలంబకుల పద్ధతులను మనఃప్రవృత్తులను గౌరవించుట రవీంద్రునికిఁ బితృపాదుల వర్తనమునుండి సంక్రమించినది. తండ్రియులవాటుల వలన రవీంద్రుఁడు భిన్న మతసామరస్యమును సంగ్రహించినాఁడు. వేఱు వేఱు మతములవారు దైవప్రార్థనమునకై యొక్కచో నేకీభవింప వచ్చుననియు, ఆయాయి మతములయం దేనిజమున్నదో యే మేలిమికలదో యేతత్సత్య సాధుత్వములలో నందఱును బాల్గొనవచ్చునను విషయము రవీంద్రుని హృదయమునం దుదయించెను.

అమృతసరస్సునఁ గొన్ని మాసములుండి దేవేంద్రనాథుఁడచ్చటినుండి కుమారుని వెంటఁగొని హిమాచల ప్రదేశమునఁగల 'డల్‌హౌసీ' కిఁ బోయెను. ఉభయులు నాలుగు మాసము లచ్చట నివసించిరి. యథేచ్ఛముగా నచ్చోటి

వనముల విహరింప రవీంద్రునికి వీలుగలిగెను. సూర్యోదయమునకు ముందే నిదుర లేచి కుమారుఁడు తండ్రి వెంట దూరము నడచివచ్చుట పరిపాటియయ్యెను. ఉదయవేళలఁ గుమారునికిఁ దండ్రి శీతల జలస్నానమే యలవాటు చేయించెను. ఈ యలవాటు కలిమి కారణముగా రవీంద్రుఁడు తాను గొన్నాళ్లకుఁ బాశ్చాత్య దేశముల వసించు టేర్పడినప్పుడు సీతువునసైతము శీతల జలములందే స్నానము చేయఁగలిగెను.

'డల్ హౌసీ' లో వాసముచేయుకాలమున దేవేంద్రనాథుఁడు కుమారుని కాంగ్లేయ గీర్వాణభాషలలోఁ బ్రతిదినమును బాఠములు చెప్పుచుండెను. దానికిఁదోడు స్వయముగాత్మ పాఠములు చదువుకొని యర్థము చేసికొని సారము గ్రహించుటయును రవీంద్రుఁడు తండ్రి శిక్షణమున సాధించెను. కవికులగురువైన కాళిదాసుని మేఘసందేశమును రవీంద్రుఁడు తొలుదొల్తఁ జదివిన దిచ్చోటనే. పల్లీజీవిత సౌభాగ్యము వక్షేందిర సౌందర్యము ప్రాచీన రాజాస్థాన రామణీయకము రవీంద్రుఁడు మేఘసందేశమున సందర్శించి యానందించెను. కాళిదాసకవి సౌశబ్ద్యమును రీతి కామనీయకమును రవీంద్రుఁడు హాయిగా ననుభవించెను. ఆ కవిచూడామణి యుపమాలంకారములు రవీంద్రుని బరవశునిఁగావించెను. రవీంద్రునికి కాళిదాసుని రమణీయార్థ ప్రతిపాదకములైన రచనలు కడపటిదనుక కడుంగడుఁ బ్రియములు.

దేవేంద్రమహర్షి రవీంద్రునికి రాత్రివేళల గగనరంగమున రాసులను జూపుచు నక్షత్రసముదయముల గుఱుతులు తెలియఁజేయుచు గ్రహగతులనుగూర్చి ముచ్చటించుచుండెడి

వాఁడు. చిన్నతనమునుండియు రవీంద్రుఁడు నభోవీథిని గని యబ్బురపోవుచుండెడివాఁడు. ఆకసమున నేవో యద్భుతములు రహస్యములు గలవని రవీంద్రుని యూహ. తండ్రి తన కెఱిఁగించు విషయములన్నియు రవీంద్రుఁడు వింతగా వినుచుండెడివాఁడు. బాల్యమునుండియు రవీంద్రునికి నక్షత్ర శాస్త్రమన్న నెంతో యాసక్తి. అంబరము నరసినపుడెల్ల రవీంద్రునికాశ్చర్యము కలిగెడిది. జ్యోతిషమనఁగా నంకెల గుణకములు తీసివేఁతలు భాగించుటలుగా రవీంద్రుఁడు భావింపలేదు. గ్రహముల దృశ్యములు సంచారములు విశ్వ ప్రబంధకవితా మర్మములుగా రవీంద్రుఁడు తలంచెను. రవీంద్రుని రచనములలోఁ బెక్కుతావులందీ తలఁపు తిలకింపనగును. పరమాద్భుతముగా సృజింపఁబడిన యీ బ్రహ్మాండమున మానవులమై పుట్టుటయు నీ సృష్టివైభవమునుగని యానందింపఁ గలుటయు స్పష్టమైన యదృష్టముగా మనము సంతసింపవలయునని రవీంద్రుని యభిప్రాయము. రవీంద్రుఁడు తన కడపటి దినములలోఁ దేటమాటలతో సులువుగా బోధపడు సాధురీతిలో సంగ్రహముగా నక్షత్రశాస్త్రసార మనఁదగిన యొక పొత్తము రచించినాఁడు. అతఁడు తారాపథమును గని యెంత సంబరపడునో పూవులను బుష్పవల్లులను విలోకించి నప్పుడును అంతయానందము నందుచుండును. ఈచిత్తవృత్తి చిన్నప్పటినుండియు రవీంద్రునికిఁ బితృసాన్నిధ్య ప్రబోధముల కలిమిఁ గలిగినదే.

రవీంద్రునికి బడి చదువు పట్టువడలేదు. అందఱు విద్యార్థులవలె ననుదినము రవీంద్రుఁడు పాఠశాలకరిగినవాఁడు

కాఁడు. తనయిష్టము బడి యతఁడు కోరినగ్రంథము నింటి పట్టునఁ జదువుకొనుట మేలని తలఁచుచుండెను. ఆయుత్సాహతో బడికిఁ బోవకున్నను రవిని మందలించుట యతని తండ్రియు నగ్రజులును మానుకొనిరి. రవి యుపాధ్యాయుఁ డొకఁడాతని యభిరుచుల గుఱించి చేరఁబిలిచి, యాంగ్ల నాటకకర్త షేక్స్పియరు రచించిన 'మెక్ బెత్' నాటకము వంగభాషలోని కనువదించి తీసికొనిరమ్మని యాదేశించెను. ఈ యాదేశము ననుసరించి యతఁ డా నాటకము ననువదింపఁ గలిగెను; కాని బడికి స్వస్తిచెప్పెను. పోకపోయినమానె, విద్యాలయముల కరిగి గడించు విజ్ఞానమునకన్న నీతఁ డింటనుండి చేయు సారస్వత పరిశ్రమమే గురుతరముగా నున్నదని విశ్వసించి రవి యన్నలు మిన్నకుండిరి.

రవి పితృపైతామహమందిరమునకు 'జోరసంకో' భవనమని పేరు. అందు రవి కౌమారదశ యానందముతోనే గడచిన దనవచ్చును. ఆయనయన్న ద్విజేంద్రనాథుఁడు పేరు మోసిన వ్యాసరచయిత. ఈ రచయిత చెలిమిఁగోరి వెంటఁబో యనుదినము వచ్చి పోవుచుందురు. జాములకొలఁది వివిధవిషయములఁగూర్చి చర్చించుచుందురు. ఆ మీమాంసలు రవి కుతూహలముతో వినుచుండెడివాఁడు. విని తన తెలివి బలిమి వెచ్చించి యాలోచనలకు దిగుచుండెడివాఁడు. ఈ తెఱఁగున రవి దృష్టి కాలక్రమమున మిక్కిలి విశాలమైనది.

బాల్యమునుండియు రవి గానప్రియుఁడు. అతనియన్న యగు జ్యోతిరింద్రుఁడు 'పియానో' వాయించుటలో దిట్ట.

ఆయన 'పియానో' వాయించు వేళల రవి చెంతఁ గూర్చుండి వినుచుండెడివాఁడు: క్రొత్త పద్ధతులతోఁ బాడఁదగిన పాటలకుఁ దగినమాటలు కూర్చుచుండెడివాఁడు. వాద్యనాదములోఁ దన కంఠస్వనము మేళవింపఁజేసి పాటలుపాడుట యలవాటుచేసెను. రవి కంఠము మధుర గంభీరమైనది. అభ్యాసవశమున నది మఱింత మధురముగాఁ బరిణమించెను. మిత్రులనేకు లీగాన మాలించి యానంద మనుభవింపఁ బ్రతి దినము 'జోరసంకో' భవనమున కరుదెంచుట తఱచుగా జరుగుచుండెను.

రవీంద్రునికి సంగీతప్రియులైన సంగాతకాండ్రు కొంద ఱేర్పడిరి. వారిలో శ్రీకంఠబాబు, అక్షయచౌదరి యను వారు ముఖ్యులు. ఒకనాఁ డాంగ్లేయరచయిత యగు 'చాటర్ టన్' బాల్యదశలో జరిగినయొక విశేషమునుగూర్చి యక్షయ చౌదరి రవీంద్రుని కెఱిఁగించెను. ప్రాచీనాంగ్లకవిత్వ రీతులఁ దా ననుకరించుచుఁ గొన్ని పద్యములు రచించి యవి పూర్వ కవిప్రణీతములనియు నముద్రితములనియు 'చాటర్ టన్' వార్తాపత్రికలోఁ బ్రకటించెను. ఆపద్యములఁ జదివి యాంగ్ల విద్వాంసులు విమర్శకులు విస్మయమునందిరి; నిశ్చయముగా నయ్యవి పురాతనసారస్వతఖండములని యబ్బురంపోయిరి: అందలి సారస్యము లెత్తిచూపి సమీక్షలు విమర్శలు ప్రచురించిరి. వారి కన్నుల కాపద్యములలో దోషములే కాన రావయ్యెను. ఉన్నవన్నియు గుణములే యయ్యెను. ప్రత్యక్ష రమునందును రసము తాండవించుచున్నదని యఖండముగా నాపద్యములను వా రభినందించిరి. ఈయుదంతమును రవీం

ద్రుఁడు విని వినోదమునకై 'చాటర్టన్' బాటనే తానొక్క సారి నడచెను. మధ్యయుగీన మైథిలీ వైష్ణవకవుల కవితా రీతుల ననుకరించుచు రవీంద్రుఁడు కొన్ని పద్యగుచ్ఛములఁ గూర్చి 'భానుసింహ' ప్రణీతములుగా 'భారతీ' పత్రికాముఖ మునఁ బ్రకటించెను. ఒకపుస్తక భాండాగారములోని పురాతన వాఙ్మయమును శోధించుచోఁ దాళపత్ర సంచయములోఁ దనకీ 'భానుసింహ' కవితాభాగము లభించెనని రవీంద్రుఁడు వెల్లడించెను. రవీంద్రుని యనుకరణ ప్రవీణత యఖండమై యుండిన హేతువున, భానుసింహకవితాఖండములు నిక్కముగాఁ బ్రాక్కాలవ్యక్తగలవని భ్రమింపఁ దగియుండెను. భానుసింహుఁడని కవియొకఁడు వంగదేశమునం దేనాఁడో వర్ధిల్లెననియు నీ పద్యము లాతఁడు రచించెననియు వంగ భాషావిద్వాంసులు విశ్వసించిరి : భానుసింహ కవిత్వమును బహుభంగులఁ గొనియాడిరి. వేయేల! నిశితకాంత చటర్జి యను పండితుఁడు భానుసింహ ప్రణీతములనుగూర్చి యొక బృహద్విమర్శ గ్రంథము రచించెను. ఒక జర్మనివిశ్వవిద్యాలయమువా రాగ్రంథవైశిష్ట్యము నరసి నిశితకాంతునికి 'డాక్టరాఫ్ ఫిలాసఫీ' బిరుదమిచ్చినారఁట.

అప్పటికాలమున గొప్పగ్రంథకర్తగా మెప్పువడయుచుండిన బంకించంద్ర చటర్జి 'వంగదర్శని' యను పత్రికలోఁ దన కథలు గాథలు ప్రకటించుచుండెడివాఁడు. ఆ కథారచనములఁ జదువవలయునను కుతూహలము వంగదేశమునఁగల యత్తరాస్యుల కందఱకును మెండుగా నుండెడిది. ఆయుబలాటము రవీంద్రునికిని గాటముగానుండిన కారణమున 'వంగ

దర్శని' వచ్చుటతోడనే యతఁడు దానింగొని విస్పష్టముగా విస్ఫుటాక్షరముగా నుచ్చైర్ఘుష్టముగాఁ జదివి యందలి సుందర కథా సంవిధానములు సోదరులకు బంధుమిత్ర సందోహము లకు వినిపించుచుండెడివాఁడు. తానును మహానందమందు చుండెడివాఁడు.

ఒకప్పుడు రవీంద్రుని యన్న జ్యోతిరింద్రనాథుఁడు "భారతి" యను పేరఁబరఁగు పత్రికనొకదాని నారంభించెను. ద్విజేంద్రనాథుఁడు దానికి సంపాదకుఁడయ్యెను. తన గద్య పద్య రచనములు ప్రకటించుకొనుటకు రవీంద్రుని కవకాశము లభించెను. "భానుసింహ" గీతములు ప్రకటితములైనవి భారతీ ముఖముననే. పశ్చిమ ఖండముల నుప్పతిల్లిన వివిధ సారస్వతములనుగూర్చి రవీంద్రుఁ డనేకవ్యాసములు భారతిలోఁ బ్రకటించెను. ప్రపంచ వాఙ్మయమునం దెందఱెందఱో కవివరేణ్యులు విరచించిన కృతుల సారము రుచిచూచి రస విమర్శన మొనరించి రవీంద్రుఁ డుపజ్ఞ వెలయించి సారస్వత సమీక్షలు వెల్వరించెను. జ్యోతిరింద్రప్రణీతములైన రూపక ములు ప్రయోగించునప్పు రవీంద్రుఁ డెన్నోసారులు ముఖ్య భూమికలు నిర్వహించెను. 'శాంతినికేతన' విద్యార్థులు నాట్యకుశలు లగుటకు రవీంద్రుఁ డవకాశములు గల్పించెను. వారికతఁడు నాట్యోపాధ్యాయుఁ డయ్యెను. నాట్యము రవీం ద్రుని కాజన్మాంత మభిమానకళ.

తన రెండవ యన్నయగు సత్యేంద్రనాథుని వెంట రవీంద్రుఁడు పదునేడవయేఁట ఇంగ్లండు దేశమున కరిగి యట నొకటిన్నరవత్సర ముండెను: 'లండను' విశ్వవిద్యాలయ

మునం దాంగ్ల సాహిత్యోపన్యాసములు వినెను: ఒకానొక యాంగ్ల కుటుంబముతోఁ గొన్నిమాసములు వసించెను: సుప్రసిద్ధాంగ్ల సారస్వతములో సారతమమైన భాగములు పఠించెను; కాని వైదేశిక విద్యావిధానములకు బద్ధుఁడై పరిశ్రమించి రవీంద్రుఁడు డిగ్రీలు సంపాదించినవాఁడు గాలేదు. ఆంగ్లేయులలో ననేకుల మైత్రిమాత్రము గడింపఁగలిగెను.

స్వదేశముఁ జేరి రవీంద్రుఁడు గాఢమగు పట్టుదలతో గ్రంథ రచనమున మగ్నుఁడయ్యెను. అచిరకాలములో 'వాల్మీకి ప్రతిభ' యను గేయనాటిక యొకటి సంతరించి ప్రకటింపఁ గలిగెను_వాల్మీకి మొదట బోయ మనుగడఁగడపి చోరశిఖామణి యనిపించుకొని కాళికాశక్తి నుపాసించి దైవ సంఘటనమున హృదయపరివర్తము నంది కడపట మహాకవియై రామాయణకావ్యము సృజింపఁగలిగిన గాథను రవీంద్రుఁడు దృశ్య ప్రబంధము గావించెను. ఒకనాఁడు వాల్మీకి యనుచరులు వనమున నొంటిగాఁదిరుగుచున్న చిన్నదాని నొక్కతెను బంధించి తెచ్చి కాళికి బలియీయ సన్నద్ధులగుదురు. ఆనాఁ డదియేమో కాని, యామెమోముఁ గని నంతనే వాల్మీకి మదిలో నక్కటిక ముదయించును. వెంటనే యాపిల్ల నతఁడు విడిచిపెట్టును. ఆ నిముసమునుండి యాతఁడు నెమ్మదిఁ గోలుపోయి, యేమో పోఁగొట్టుకొనినవానివలెఁ బిచ్చిబికారిచాడ్పున సంచరించును. ఈసరణిఁ దిరుగుచుండు వాల్మీకి యొకచో నొకచెట్టుపైఁ గూర్చున్న పిట్ట నొకదానిని గుఱివెట్టి తనయనుచరుఁడొక్కఁడు కొట్టిచంపుట చూడఁ దటస్థించును. ఆతని హృదయమున నుప్పతిల్లిన కరుణ పొంగి యుబికి పొరలి వెల్లివిరియఁగా

నోటి వెంట వెల్వడిన యక్షరములు ఛందోబద్ధములై శ్లోకముగా రూపొందెను. తన యాస్యమునుండి వెడలిన రమ్యాక్షరముల మాధుర్యమునకు వాల్మీకి దా ముగ్ధుఁడగును. అంతలో నాతనిమ్రోల భగవతి సరస్వతి సాక్షాత్కరించును. "ఓయీ, నీ యంతరంగమున దయాకాసారము త్రవ్వినదానను నేనే. నాఁడు నీ యనుచరులకుఁజిక్కిన చిన్నియన్నువను నేనే. ఇదిగో, దీని నీ కిచ్చుచున్నాను. దీనిపై నీ చేయఁగల సాధన మనుపమానమై యనూనఫల మీయఁగలదు. కైకొనుము;' అని యాతని కుపాయనముగాఁ దన వీణ నొసంగి యాశీర్వదించి సరస్వతి యంతర్ధానమగును. — కథాసంవిధానమిది. రవీంద్రుని నాటికలో నీ యుదంతమంతయు రసవంతముగా నావిష్కృతమైనది. బోయమన్నీని జీవితము, వాని నాయకత్వమున వర్తించు వనచరుల యాటపాటలు వేఁటలు వినోదములు విహారములు వనదేవతా సంగీతములు నాట్యములు 'వాల్మీకి ప్రతిభ' లో నావిర్భవించినవి. ఈ నాటికలోని రవీంద్రుని సంగీతసృష్టిలో నొక విశిష్టత కలదు. వంగదేశీయాభిరుచికి విరుద్ధముగానిపద్ధతి ననుసరించి రవీంద్రకవి వాల్మీకిప్రతిభలో విదేశీయగానవిశేషముల నంతర్భూతము గావించినాఁడు. తా నింగ్లండులో విని యనుభవించిన పాశ్చాత్త్య సంగీత సారస్యముల నతఁ డీరూపకమునఁ జొన్పి విజాతీయ గానమాధుర్యముతో భారతీయనాటక కళాసాందర్యమును మేళవింపఁజేసినాడు.

రవీంద్రుఁడు తన సోదరుఁడగు జ్యోతిరింద్రునితోఁ గొన్ని మాసములు చంద్రనగరమున వసించి గంగాతరంగిణి

గమన గాంభీర్యముగని, జాములకొలఁది దాని తటముల విహ రించి, తన్మనోజ్ఞతఁ దనివిదీఱ జుట్టి యనేక కమనీయ కవితాఖండములు సృజించెను. ఇవే ‡సంధ్యా సంగీతమను మకుటముతోఁ బ్రకటితమై యతనికి విస్తారమైన యశస్సు చేకూర్చెను. ఈ పాటల సంపుటము ప్రకటితమైన కొన్నిదిన ములకొక సంపన్నునియింట పాణిగ్రహణ మొకటి జరిగెను. ఆ పెండ్లికి విద్వాంసులు కవులు కథారచయితలు కళాకోవి దులు పలువురు విచ్చేసిరి. పూజ్యుఁడు సుప్రసిద్ధకథానిర్మాత శ్రీ బంకించంద్రచటర్జి దయచేయుటచూచి పెండ్లిపెద్దలు తద్దయు గౌరవించి యున్నతాసనమునఁ గూర్చుండఁబెట్టి పుష్పమాలఁ గొనివచ్చి కంఠసీమఁగీలించిరి. అత్తఱి రవీం ద్రుఁడు వివాహమంటపమునం దడుగుపెట్టుట బంకించంద్రుఁడు చూచి చప్పునఁ దన మెడలోని పూలహారముతీసి రవీంద్రుని కంఠము నలంకరింపఁజేసి, 'యిదిగో, ఈ పూలమాల కర్హతగల ప్రతిభాశాలి యీ కవీంద్రుఁడు సుఁడీ, ఈతఁ డిటీ వల రచించిన 'సంధ్యాసంగీతము' చదివి మీ రానందింప లేదా?' యని యభినందించి రవీంద్రు నాలింగన మొనరించు కొనెను. వంగకవిసంఘమున రవీంద్రుని కీ రచనమువలన విఖ్యాతి విస్తారమయ్యెను.

రవీంద్రుని కిరువదేండ్లు పూర్తియైన కొంతకాలమున కొకనాఁటి యుదయమున నొక యద్భుతానుభూతి కలిగెను. ఆనాఁడు రవీంద్రుఁడు కలకత్తానగరమున సద్దరు వీథిలోఁ దూర్పు చివర నొక భవనోపరిభాగమునుండి సూర్యుని

యుదయము నరయుచుండెను. ఆకస్మికముగా నతని కన్ను లకు విశ్వమంతయుఁ గ్రొత్తరూపముతో దీపించెను. ఆతని చూపు నావరించియున్న మంచుతెర తొలఁగింపఁబడినట్లును, జగమంతయు నవతేజస్సుతో వెలుఁగుచున్నట్లును గోచరించెను. ఏవంకఁగను గొన్నను సౌందర్యతరంగములు చెలరేఁగుచుండెను, ఆనందలహరులు ప్రవహించుచుండెను. ఆనాఁటి ప్రొద్దుపొడుపులో నొక దివ్య నవ్యత కలదు. రవీంద్రకవి నయనారవిందముల వికసింపఁ జేసిన యానాఁటి యహర్ముఖము నిశ్చయముగా సుప్రభాతమే. బహిర్ముఖమైయుండిన యతని చూపు నిమిషములో నంతర్ముఖమైన యాధ్యాత్మికదృష్టిగా మార్పునందెను. అతనికిఁ గనఁబడు సామాన్యవస్తువులన్నియు నవీనదృశ్యములయ్యెను. సమస్త చరాచరములయందును రవీంద్రునికి సదాతనమైన రామణీయకము ప్రతిబింబితమగుచుండెను. విశ్వమంతయు నిత్యమై సత్యమై శివమై సుందరమై చూపట్టెను. ఈ భవ్యానుభవము నందినపిమ్మట రవీంద్రుఁడును నూతన పురుషుఁడయ్యెను. అట్టి రవీంద్రుని సన్నిధి కతని పూర్వపరిచితుఁ డొకఁడు విచ్చేసెను. ఈ పరిచిత పూర్వుని ప్రవృత్తి రవీంద్రునికి నచ్చినది కాదు. ఆతఁ డెప్పుడు వచ్చినను రవీంద్రుఁడు సహించెడువాఁడు కాఁడు. ఆనాఁడట్లు కాక రవీంద్రుఁ డానందముతో వానికి స్వాగతముచెప్పి కుశల ప్రశ్నములడిగి వీడ్కొలిపెను.

నవ్యానుభూతిఁ గనిన యానాఁడు రవీంద్రుఁడు 'నిర్ఝర స్వప్నభంగము' అను హృద్యపద్యావళి రచించెను. దాని సారాంశ మిది:— హిమానీబంధనాలయమున నిర్బంధితమైన

యొక నిర్ఝరము సూర్యకిరణ ప్రసారమున బంధములఁ బటాపంచలు గావించుకొని ప్రచండవేగముతో వెల్వడి, మహాస్రోతస్వినిగాఁ బ్రవహించి యనంతసాగరమున లీనమైపోయినది. చిరకాలనిర్బంధమునఁ బరవశమైయుండిన తోయసమూహము బయల్వెడలి పరమానందభరమునఁ దరంగపరంపరలుగాఁ బరిణమించి పరువులెత్తుటను రవీంద్రుఁడు సుమనోమనోహరముగా వర్ణించినాఁడు. పరవశ్యతలోని పంచకరపాటులన్నియుఁ బంచ బంగాళముకా, స్వాతంత్ర్యము వలనఁ గలిగిన హర్షము మిన్నుముట్ట నిర్ఝరము కాంక్షించు పరమార్థము సాగరసంగమమే; అభిలషించు వర మాత్మత్యాగానందమే. స్వైరవిహారమున వర్తించిన తన వారిపూరమును దానై సముద్రుని కర్పించి యీ సెలయేఱు నామరూపములఁ గోలుపోయినదిగదా!

రవీంద్రుని యావలి రచన మొకనాటకము. దాని పేరు ‡“ప్రకృతి నిర్యాతనము”. ఈనాటకమును రవీంద్రుఁడే యాంగ్లభాషలోని కనువదించి ‘సన్న్యాసి’యని దీనికిఁ బేరు పెట్టినాఁడు. ‘విశ్వవిభూతి నార్జించుటకు, సృష్టిసౌందర్యము చూఱగొనుటకు, సన్న్యాస మక్కఱలేదు. మిత్రప్రేమయుఁ బ్రకృతిశోభయు సత్యాన్వేషణకుఁ బ్రతిబంధములుకావు సరి కదా, ప్రణయసౌందర్యరమణీయార్థ ప్రతిపాదకమైన భాషలో సత్యదేవతయే స్వయముగా మానవునితో మాటాడును ఇఁక సన్న్యాసమేల?’ అని యీనాటక ముద్బోధించుచున్నది

'ఐహికవాంఛలకు నే నతీతుఁడను. వ్యామోహములు నాకు లేవు. మానవసంఘమున వసించినను నా కిప్పుడు భయము లేదు. మంచు విరిసిపోయినది. సత్యజ్ఞానసూర్య బింబము స్వయంప్రకాశమై వెల్గుచున్నది. అన్యత్ర ప్రపంచమున విహరించినను దానిమాలిన్యము నన్నంటదు' అనియొక సన్న్యాసి తన నెలవైన గుహను వీడి, జనపదముల సమీపమునకు వచ్చి, యొకదారి చేరువఁ గూరుచుండి, త్రోవఁ బోవువారిని వచ్చువారిని జూచుచుండెను. ఒక చిన్నపిల్ల - వాసంతియనఁ బరఁగునది, 'నా' యనఁదగిన వారెవ్వరును లేనిది- మెల్లఁగా దారినడచుచుండును. మతవ్యవస్థ నతిక్రమించెనని, కులాచారము నుల్లంఘించెనని, యాబాలిక తండ్రిని సంఘము వెలిపెట్టినది. అట్టివాని కడుపునఁ బుట్టినదని వాసంతిని వచ్చువారు పోవువారు తొలఁగిపొమ్మని, చీకొట్టి గద్దించి యీసడించుచుండిరి. ఈస్థితిలోనున్న బాలిక సన్న్యాసినిగని, యతని సమీపించి కుఱంగటఁ గూర్చుండును: కొంతసేపటికి సన్న్యాసి యంతికమున నిదురించును. ఆమెపరిస్థితి నరయు సన్న్యాసి హృదయమునఁ గరుణ యంకురించి క్రమక్రమముగాఁ దీగెసాగి చిగిరించి పూచి ఫలించును. వాసంతి మేల్కాంచును. జడదారి కరతలములు తనచెక్కిళ్ళనొత్తుచు, సమీపమునం దాలంబరహితయై యల్లాడుచున్న వల్లినిజూపి 'యదిగో, యది నావలెనే యూఁతలేనిదై చలించుచున్నది. అల్లుకొనుట కేదియేని చెట్టున్న నెంతబాగుండును?' అని పలుకును. జటి యీమాట విని సంచలితమనస్కుఁ డగును. వల్లికను బెల్లగించి విసరివైచి వాసంతిని దూరము త్రోసి

పుచ్చి సన్న్యాసి బిరబిరఁ బరుగెత్తిపోవును. 'నాయనా, నీవు పోయిన నాప్రాణములు నిలువవు. పోవుచున్నావా?' యని వాసంతి యేడ్చుచున్నను సన్న్యాసి లక్ష్యముచేయక దాఁటిపోవును.

ఆవలిరంగమున సన్న్యాసి యొక పర్వతప్రదేశమునఁ బ్రకృతి రామణీయక మనుభవించువాఁడుగాఁ బ్రవేశించును. పేలికలుతాలిచిన పేదపిల్లయొకతె 'నాయనా. నాయనా,' యని కేకలువేయుచు సన్న్యాసి దృష్టి నాకర్షించును. ఆమె దీనస్వరూపము సన్న్యాసిస్మృతికి వాసంతికను గొనివచ్చును. ఆచిన్నదాని యమాయిక మూర్తిని గని, యాబాల యార్తకంఠ మాలించి సన్న్యాసి యార్ద్రమనస్కుఁడగును. తనలోఁ గలిగిన దయ నెదుర్కొనుట కతఁడీతూరి యత్నింపఁడు.

కడపటిరంగమున సన్న్యాసి తన దండకమండలువుల భగ్నము కావించి జనపదోపాంతమునఁ బొడసూపును. ప్రపంచానుషంగమే నరులకుఁ దరణోపాయమని తాను సాధించిన యీ నవీనమార్గము ఘంటాఘోషముగా మానవ సంఘమునకు బోధించుచు సన్న్యాసి వాసంతి నన్వేషించుచుండును, "నీ మిణుగురుఁ బురుగు దీపమును నమ్మికొని దారి వెదకికొనుచు, వేవెలుఁగు దీప్తిని, నక్షత్రకాంతిని నిరాకరించిన వెంగలివిరా నీవు! సత్యస్వరూప మెఱుంగఁ జాలిన తత్త్వ మొక్క ప్రేమయే" యని ఘోషించుచు, దారి నడచు వారందఱిని వరుసగా 'మా వాసంతి యెందున్నదో చెప్పఁగలరా?' యని యడుగును. ఎట్టకేలకు బదులుమాట

సన్న్యాసికి వినవచ్చును. ఏమని ? "పాపము ! వాసంతి చని పోయినది." అని. ఇది యీ రూపకములోని సంవిధానము.

ఈ దృశ్యకావ్యమును రవీంద్రుఁడు తనయన్న సత్యేంద్రనాథునితో 'కార్వారు' పురమున వసించుకాలమున రచించినాఁడు. భరతఖండపుఁ బశ్చిమ సముద్రతీరమందున్న ఆయూరి యందమైన వాగర్త రవీంద్రుని హృదయము నాకర్షించినది. అతఁడా నగరమున నెన్నో రీతుల మిత్రులతోఁ బ్రొద్దుపుచ్చెడివాఁడు. వ్యాయామక్రీడలు వనభోజనములు వెన్నెలవిహారములు వినోదములు సంగీతములు - ఈయన్నిటిలోఁ బాల్గొనుచుండినను రవీంద్రుఁడు సాహిత్య పరిశ్రమ మొనర్చుచునే యుండినాఁడు. అతని 'ప్రకృతినిర్యాతన' నిర్మాణము జరిగిన దిచ్చోటనే.

---

శ్రీ

# గురుదేవ చరిత్రము

## ద్వితీయోల్లాసము

తన యిరువదిరెండవయేఁట రవీంద్రుఁడు గృహస్థుఁడయ్యెను. ఆయన సతీమణి మృణాళినీదేవి. వివాహమైన పిమ్మట రవీంద్రుఁడు పదునైదు వత్సరములపాటు మండలాంతరపర్యటనములు మానుకొని యింటిపట్టుననే వసించెను: పట్టుదలతో సారస్వత పరిశ్రమము కావించెను. ఆయన కిరువురు కుమారులు ముప్వురు కుమారికలును జన్మించుటయు సంపూర్ణ సాంసారిక సౌఖ్య మనుభవించుటయు నీ లోన నివ్వటిల్లెను.

మృణాళినీదేవి తొలికాన్పు మాధవీలత. ఈమె కలిగిన రెండేండ్లకు రవీంద్రుని ప్రథమపుత్త్రుఁడు రతీంద్రనాథుఁ డుదయించెను. ఆవల రెండువత్సరములకు రేణుక యను రెండవ కూఁతురు, పిమ్మట రెండువత్సరములకు మీరా యను మూఁడవ కుమారికయు జన్మించిరి. మఱి రెండేండ్లకు రవీంద్రుని రెండవకొడుకు శమీంద్రుఁడు జన్మించెను.

ఏ చిన్ని బిడ్డలను జూచినను మిక్కిలి మక్కువతో మెలఁగు రవీంద్రునికి స్వీయసంతానముపట్ల నిండారిన వాత్సల్య ముండుటలో వింతలేదుగదా! బాలకులకొఱకు రవీంద్రుఁ డెంతో వాఙ్మయము సృజించెను. ఆయన యన్న సత్యేం

ద్రుఁడు నడపుచుండిన 'బాలిక' పత్రికాముఖమున రవి కథలు పద్యములు వ్యాసాదికములు పెక్కు ప్రకటించెను: ఇట్లే భారతి పత్రికయందును బ్రచురించెను. ఈ సారస్వత ప్రచురణము లాతనిపేరు నానాదిశల వ్యాపింపఁజేసెను. ఆయన కలమునుండి వెలువడిన రచన యేదియైనను విలువగలదని యక్షరాస్యులందఱుఁ గుతూహలముతోఁ జదువుచుండెడివారు.

వంగదేశమున బ్రాహ్మ సమాజము నెలకొల్పిన వారిలో మహర్షి దేవేంద్రనాథుఁ డొక్కఁడు. ఆతఁ డేకేశ్వరోపాసకుఁడు. ఆయన యనుయాయులు నట్టివారే. వీరు విగ్రహారాధనమున కీయకొనరు; ప్రాచీన మతాచారములఁ గొన్నింటిని వీరు నిరసింతురు. బ్రహ్మసమాజము రవీంద్రుఁడు చిన్నవయస్సులో నుండునాటికి మూఁడు భిన్న శాఖలుగాఁ జీలియుండెను. ఆశాఖలలో నాది బ్రహ్మసమాజమని పిలువఁబడు సంస్థతో దేవేంద్రనాథుని కుటుంబము సంబంధపడియుండెను.

పరిణీతుఁడైన కొంతకాలమునకు రవీంద్రనాథుఁ డాది బ్రహ్మసమాజ శాఖకుఁ గార్యద్రష్టయయ్యెను. ఎన్నో ప్రార్థనా గీతికలు బ్రాహ్మ సమాజమందిర దైవప్రార్థనా సమయముల సభ్యులు గానముచేసికొనుట కనువుగా రచించెను. అనేక పర్యాయములు పరమేశ్వరతత్త్వమునుగూర్చి సమాజ సభ్యుల ముందర నుపన్యసించెను. ఈ యుపన్యాసముల మూలమున శ్రోతల హృదయములను రవీంద్రుఁ డుజ్జ్వలత లూఁగించెను. పరమార్థమును గుఱించి రవీంద్రుఁ డొనర్చిన గాఢపరిశ్రమమున కాయుపన్యాసములు నిదర్శనములు.

రవీంద్రుఁడు దేశభక్తి ప్రపూరితములైన పాట లెన్నియో వ్రాసెను. *'సోనర్ బంగ్లా' యను రవీంద్రుని పాట బహుళప్రజాదరణమును బడయఁగలిగిన యాకవిరచనములలో నొకటి. ఈ పాటకు వంగదేశమున వెలలేని పలుకుబడి కలదు. ఆపాటలో మాటలకూర్పునేర్పు - అది నడచుదారి - దానితీరు-జానపద గేయధోరణిలో సాగు దాని రాగసరణి - ఇవన్నియు నా గీతికను వంగభాషాయోష కొక నవాలంకారముఁ గావించెను.

బంగాళీభాషకు రవీంద్రుఁడు చేసిన సేవ యమూల్యము. కడచిన శతాబ్ది కడపటి భాగమున వంగదేశీయులలో గొప్పచదువులు చదివిన పెద్దవారందఱు పురమందిరోపన్యాస వేదికలయందేకాక యింటను బయటను జరుపు సంభాషణములందు సైత మాంగ్లేయభాషనే వాడుచుండుట పరిపాటి యయ్యెను. పాఠశాలలయం దుపాధ్యాయులు విద్యార్థుల కింగిలీషులోనే విషయములు బోధించుచుండిరి. మాతృభాషలో మాటాడుట తమ మహనీయతకు న్యూనతఁ గల్పించునని భావించు వారెందఱో పెద్దవారే యుండ నింగ్లీషు కలాలయములయందు చదువుకొను చిన్నవయసువారి మాట చెప్పవలయునా? తెగులుగా నల్లుకొనుచున్న యీ యలవాటును మాన్పుటకై రవీంద్రుఁ డెంతో పాటుపడెను. ఉపన్యాసము లిచ్చి, వ్యాసములు వ్రాసి మాతృభాషాప్రాధాన్యమునకై వాదించి యతఁడు తన కాంక్షితము సాధించెను. ఏఁటేఁట జరుగు రాజకీయ సభా సమావేశములలో నుపన్యా

* 'సోనర్ బంగ్లా' యనఁగా బంగారు బంగాళమని యర్థము.

సింప వలసిన ప్రముఖులు మాతృభాషలో మాటలాడ వలయునని రవీంద్రుఁడు గట్టిపట్టుపట్టెను. పోరాడెను. ఈపో రాటము ఫలించుట కైదాఱు సంవత్సరములు కావలసి వచ్చెను. కడకు రవీంద్రుఁడు మాతృభాషకు విజయము సంపాదింపఁ గలిగెను. చిన్నబిడ్డలకు బంగాళీభాషలోనే చదు వంతయు నేర్పవలసిన ట్లతనికాలములో వంగరాష్ట్రీయ విద్యా పద్ధతులయందు మార్పు సిద్ధించుటకు రవీంద్రుఁడు కారణము.

కలకత్తా విశ్వవిద్యాలయమువారి వార్షిక స్నాతకో త్సవోపన్యాసము లింగ్లీషు భాషలోఁ బ్రవర్తిల్లుచుండినవి. గాటముగా నాటుకొనిపోయిన యీయలవాటు నున్మూలించి త్రుంచివైచిన ధీరుఁడు రవీంద్రుఁడు. ఒక సంవత్సరము కలకత్తా విశ్వవిద్యాలయాధికారులు రవీంద్రుని స్నాతకో పన్యాసము నర్థించిరి. ఇచ్చట కతఁ డంగీకరించెను; మాతృ భాషలో నుపన్యసించెను. ఆనాఁటిమాటలతో రవీంద్రుఁడు మాతృభాషకుఁ బ్రశస్తి కలిగించి పరభాషకు స్వస్తిచెప్పఁ గలిగినవాఁడయ్యెను ఈ చందమున రవీంద్రుని మాతృ భాషాప్రీతి వంగదేశీయులనేకాక యన్యరాష్ట్రప్రజలను సైతము విజాతీయభాషాదాస్యమునుండి విడిపించు మార్గ మునకు దర్శకమయ్యెను.

రవీంద్రుని వంగభాషారచనములు ప్రాచీనపండితుల యాదరమునకుఁ బాత్రములు కాలేదు. ఆతని వ్రాఁతలన్నియు వ్యావహారికభాషలో నున్నవి. ఆ వ్రాఁతలయందు వ్యాకరణ విరుద్ధ ప్రయోగములున్నవి. వ్యావహారికభాష సజీవభాష

యనియు, నట్టిభాషలో గ్రంథములు రచింపవలయుననియు రవీంద్రుని విశ్వాసము. ఆయన రచనములు లలితమైన సులభ శైలిలో సాగినవి. బాలబాలికలకును దేలికగాఁ దెలియఁదగిన రవీంద్రుని గ్రంథములు పెక్కులున్నవని యభిజ్ఞులందురు.

రవీంద్రుఁడు నగరవాసమునే కాక జనపదజీవితమును గూడ రుచిచూచినవాఁడు. ఒరిస్సారాష్ట్రమునఁ బద్మానదీ తీరమున 'షిలీడా' యను జనపద సమీపమున రవీంద్రుని కుటుంబమునకు భూములుండినవి. ఆ పొలముల వ్యవసాయమునుగూర్చిన పెత్తనముచేయవలసినభారము రవీంద్రునిపైఁ బడిన హేతువుచే నాతఁడు కొంతకాలము 'షిలీడా' యందుండి కార్యములు నిర్వహింపఁబోయెను. అచ్చటి జానపదులలో నాతఁడు కాపురముండి వారి కష్టసుఖములలోఁ బాల్గొనెను. స్వయంకృషిపై నాధారపడి, తమ యార్థికస్థితి నభివృద్ధి పఱచుకొను తెఱఁగున జీవితపద్ధతుల మార్చుకొనుఁడని రవీంద్రుఁడు పల్లెటూరి జనుల కుద్బోధించెను. తాను దన కన్నులతోఁగన్న జానపదజీవితమును వర్ణించుచు నచ్చోటినుండి మేనగోడలికి వ్రాసిన లేఖలు గ్రంథరూపమునంది ప్రకటితములైనవి. వంగ జీవితదిక్ప్రదర్శన మనఁదగిన యీ లేఖాసముదయమునకు రవీంద్ర గ్రంథసంచయమున గణనీయస్థానమున్నది.

రవీంద్రుఁడు జానపదులనడుమ నివసింపఁదొడఁగిన కొంతకాలమునకు 'భారతి' తన సంచారము చాలించెను. 'సాధన' వెల్వడెను. ఇదియొక సారస్వత పత్రిక. రవీంద్రుఁడే దీని నెలకొల్పినవాఁడు. అచిరకాలములో దీనికిఁ బేరుప్రతి

ష్ఠలు విరివిగా లభించెను. 'మా చిన్నబాబు' § అను పేరుతో రవీంద్రుఁ డొక కథను రచించి ప్రకటించెను. అది కరుణరసప్రపూర్ణమైనది. దాని మూలమున రవికి మితిలేని కీర్తి చేకూరెను. రవీంద్రుఁడు 'మాలిని' యను రూపకమును గూడ 'సాధన' యందే ప్రచురించెను. 'శాపము' 'వీఁడు కోలు' 'బంగారుపడవ' మున్నగు రవీంద్రకృతుల యావి ష్కృతికిని 'సాధన' యే తొల్త సాధనమయ్యెను. అతని కావ్యములం దగ్రశ్రేణికిఁ జెందిన 'ఊర్వశి' యను పద్య గుచ్ఛముగూడ 'సాధన' ద్వారముననే లోకమున కెక్కినది. పత్రికాముఖమున నప్పటప్పటికిని బ్రకటితములైన యాతని పద్యములు గ్రంథస్థములై మొట్టమొదట 1896 లో వెలు వడెను. ఆవల నాలుగు వత్సరములలో నతని పద్యసముద యము లైదు సంపుటములుగా బయల్వెడలెను. మొదటిది 'కల్పన'; రెండవది 'కథ'; మూఁడవది 'కాహిని'; నాల్గ వది 'క్షణిక;' అయిదవది 'కణిక'. ఈ పద్యపరంపరల యందు రవీంద్రుఁడు వెల్వరించిన కవిత్వమునకు మహా రాష్ట్రుల వీరగాథలు సిక్కుల పరాక్రమ ప్రభావములు వస్తు విశేషములై వన్నెకెక్కినవి.

రవీంద్రుని రచనములను వంగదేశ పురాతన సాహిత్య సంప్రదాయజ్ఞులు విద్వాంసులు మెచ్చుకొనరైరి. అంతేకాదు: హెచ్చుగా నేవగించుకొనిరి. ఆయన వ్రాఁతలనుండి కొన్ని వాక్యముల నుద్ధరించి విద్యార్థులకిచ్చి 'దీనిని దిద్ది నిర్దుష్ట మైన బంగాళీభాషలో వ్రాయుఁ' డని యడిగిన విద్యాధికారుల

§ My Lord, the Baby

పరీక్షా ప్రశ్నపత్రము లుండిన వనుట సత్యమే కాని యతి శయోక్తి కాదు. కలకత్తా మెట్రికులేషను పరీక్షకు రవీంద్రుని బరీక్షకునిగా నియమించు టుచితమని యెవ్వరో సూచింపఁగా, వంగవార్తా పత్రికలన్నియు రవీంద్రుఁ డపండితుఁడనియు, నిర్దుష్టమైన బంగాళీభాష వ్రాయఁజాలనివానికిఁ బరీక్షకాధి కార మిచ్చుటకన్న వేఱొక్క పాపమ్మేముండునా? యనియు నాక్షేపించినవి. కలకత్తా విశ్వవిద్యాలయోపాధ్యక్షుఁడు పూజ్యుఁడు సర్ - ఆషుటోష్ ముఖర్జి యొకతఱి రవీంద్రునికిఁ § 'గళాప్రపూర్ణ' బిరుదము నీయవలయునని యుపపాదిం పఁగా నా విద్యాలయ కార్యనిర్వాహక సభ్యు లందుల కీయ కొనలేదు. పరాభిప్రాయ వాతావరణ మిట్లున్నను దనమతము మార్చుకొనక, జంకు లేని పట్టుదలతో రవీంద్రుఁ డాత్మవిశ్వా సముతో గ్రంథరచనము సాగించినాఁడు. '† ఋతుపర్యవ సానము' 'సతి' 'నరకవాసము' 'కర్ణుఁడు – కుంతి' మున్నగు కృతులు రచించినాఁడు; ప్రకటించినాఁడు; విఖ్యాతి నార్జించినాఁడు. నిశ్చయముగా రవీంద్రుఁడు ధీరాగ్రేసరుఁడు.

---

§ Doctorate of Literature.
† The season's end.

శ్రీ

# గురుదేవచరిత్రము

## తృతీయోల్లాసము.

రవీంద్రుఁడు తన నలువదవయేఁట 'నైవేద్య' మను పేర భగవద్భక్తి పరిపూరితమైన గీతికాగుచ్ఛక మొకటి కూర్చెను. ఒకనాఁడు నిజపితృపాదులసన్నిధి కరిగి, యాగీతి కలలోఁ గొన్నిఁటిని వారికిఁ జదివి వినిపించెను. వారాపాటలు విని హర్ష పులకితాంగులైరి. ఈశ్వర స్వరూపమైన సత్యమును రవీంద్రుఁడు గ్రహింపఁ గలిగెనని వారు సంతృప్తులైరి.

పూర్వప్రభువులు తమ యాస్థానుల యందు సంగీత సాహిత్యములను గాయక విద్వజ్జన ముఖమున విని మెచ్చి యానందించి కళావిదుల నాదరించి బహూకరించెడివారు గదా! ఈ నాఁడు దేవేంద్రనాథుఁడు రవీంద్రుని కవితాగాన మాలించి, 'నైవేద్య' ముద్రణార్థము కావలసిన విత్తము ప్రీతిదత్తముగా నిచ్చెను. దానితో నైవేద్య పద్యావళి ప్రకటితమయ్యెను.

తరువాత నొకనాఁడు రవీంద్రుఁడు తండ్రిగారి కడ కరిగి శాంతినికేతనమున విద్యాలయ మొకటి నెలకొల్పఁ దనకుఁ గోరిక కలదనియు, దాని కనుమతించుటయే కాక తదుద్యమసాఫల్యమందుమని తన్నాశీర్వదింపుఁడనియు వేఁడి, వారి దీవనతోఁ బాఠశాల ప్రారంభించెను.

రవీంద్రునికి బిడ్డలయెడ మక్కువ మిక్కుటము. అతని సొంత పిల్లల జంజాటమే యెంతో కలదు. దేవుఁడిచ్చిన దేహ

దార్ఢ్యము బుద్ధిబలము పూర్ణోపయోగమునకుఁ దెచ్చికొని జీవితము నానందముతోఁ గడపు విధానమును బాలకులకు బోధింపవలయుననియు నట్టిబోధమును వారికిచ్చు విద్యా విధానము సాగింపవలయుననియు రవీంద్రుని యుద్దేశము

మొట్టమొదటి సంవత్సరము రవీంద్రుని బడిలోని విద్యార్థు లైదుగురు. క్రమక్రమముగా వారి సంఖ్య వర్ధిల్లినది. చిరకాలముగా రవీంద్రుని మదిలో మెదలుచుండిన ప్రాచీన గురుకులములు తపోవనములు శాంతిని కేతన విద్యాలయ సంస్థాపనమునకు మూలములై యుండవలయును.

శాంతిని కేతన విద్యార్థు లహర్ముఖములందు మంగళకరమైన సంగీతశ్రవణముతో నిదురమేలుకొందురు; కర్ణరసాయనమైన గాన మాలకించి రేల శయనింతురు. వారికొదవునది కమ్మనిపాటల వినుకలికలిమియేకాదు. గానకళాభ్యాసభాగ్యముగూడ వారికి విద్యావిధానములోనున్నది.. రవీంద్రుని గీతములు బాలబాలికలు నేర్చుకొని ప్రచారమునకుఁ దెచ్చిరి. తెలతెలవాఱువేళ వారు ప్రభాతగీతికలు పాడుదురు. ఆయాసమయములకుఁ దగినపాటలు రవీంద్రుఁడు రచించి పాడి చూపించుచుండ నయ్యవి శాంతినికేతనమున విద్యార్థుల కుపాదేయము లగుచుండెను. రవీంద్రుని మేనల్లుఁడు 'దినేంద్రనాథుఁ'డీ విద్యాలయమున కెంతేని సేవ కావించినవాఁడు. అతఁడు గొప్ప సంగీతకళాపారీణుఁడని పేర్వడసినవాఁడు. రవీంద్రగీతములు శ్రద్ధాభక్తులతో విద్యార్థులకు నేర్పినవాఁడు. ఈతని మూలమున రవీంద్రుని కవితాసువర్ణమునకు సంగీతసౌరభ మబ్బినది.

ఒక్కొక్క ఋతువు ప్రారంభమైనప్పుడు దాని రాక నుచితసంరంభముతో మన్నింపవలయునని రవీంద్రుఁడు విద్యార్థుల కుపదేశించెను. ఈయాదేశము నాదలఁదాల్చి విద్యార్థులు తమ నికేతనమున వసంతోత్సవము నేఁటేఁట జరుపుచుండిరి. అట్లే వర్షాగమమున శరదారంభమున వారి పండుగలు ప్రవర్తిల్లుచుండినవి. ఆయా పండువులలోఁ బ్రద ర్శింపఁబడుట కనువైన నాటకములను రవీంద్రుఁడు రచించు టయు నవి శాంతినికేతనమునఁ బ్రయుక్తము లగుటయు జరుగుచుండెను. 'శారదోత్సవము' 'ఫల్గుని' 'వసంతనాటిక' యను నీరూపకత్రయము రవీంద్రకవి రచించి శాంతినికేతన విద్యార్థి నటబృందముచేఁ బ్రయోగింపఁ జేసినదే. నాటక ప్రయోగములలో విద్యార్థులు పాల్గొనుటవలన వారికి విశిష్ట మైన విజ్ఞానము చేకూరునని రవీంద్రుని విశ్వాసము. ప్రతి వత్సరాంతమునను శాంతినికేతన విద్యార్థులు రవీంద్రుని రూపకములలో నొక్కొక్కటి ప్రయోగించుటతో నాయేఁటి విద్యాక్రమము పూర్తి చేయుచుండిరి.

రవీంద్రుఁడు తన విద్యా ప్రచార పద్ధతులు గ్రహిం చిన యువకులను శాంతి నికేతనమునం దధ్యాపకులుగా నియ మించి యాసంస్థ క్రమాభివృద్ధికి వచ్చుమార్గముల ననవరత మన్వేషించు చుండెను. శాంతినికేతనమునఁ జదువులు గఱపు గురువులు, నేర్చుకొను శిష్యులు కలసిమెలసి యొకకుటుంబ ములోనివారుగా మెలఁగు మెలపును రవీంద్రుఁడు పెంపొం దించెను. ఆతఁడును బిడ్డలతో నెంతో చనవుతో సంచరిం చుచు, వారి యాటపాటలలోఁ బాల్గొనుచుండెను. పిలుపడు

నప్పుడెల్ల గురువులు వృక్షచ్ఛాయలలో శిష్యులకుఁ జదువులు చెప్పుచుండిరి. శిష్యులు తమశీలమును రక్షించుకొనుచు, నుచిత స్వాతంత్ర్య మనుభవించుచుండిరి; తా మొక సమాజ మేర్పఱచుకొని సంఘీభావము కుదుర్చుకొనుచుండిరి. తమ సమాజసభ్యుల వర్తనమును దిద్దుకొనుట కావశ్యకములైన కట్టుబాటులు తామే గట్టిచేసికొనుచుండిరి. ఆశ్రమవాటి శుద్ధ్యము పోషించు భారము విద్యార్థులదే. వ్యాయామ క్రీడలు వినోదములు జరుపుకొను బాధ్యత్వము వారిదే. ఆశ్రమమున కతిథులుగాని యభ్యాగతులుగాని వచ్చినప్పుడు వారిసౌకర్యముల నరయుటయు విద్యార్థుల విధియే. సమాజ సభ్యుఁడైన యొకవిద్యార్థి సంఘనిబంధనము నుల్లంఘించి నప్పుడు వాని శిక్షింప వలయునా? దండింపవలయు నేని వాని నేవిధముగా దండింపవలయును? ఏశిక్ష విధింపవలయును? అనువివరములు నిర్ణయింప వలసినపనిగూడ విద్యార్థి సంఘ సభ్యులదే. వారివిద్యావిధాన మిట్టిది. ప్రజాస్వామ్య ప్రభుత్వములోఁగల కష్టసుఖములు లాభాలాభములు మంచి చెడ్డలు యువకులు గ్రహించి గుణపాఠములు నేర్చుకొనుటకు శాంతినికేతనములో నిట్టి సదుపాయములు కలవు.

తాను విదేశముల కరిగి చూడఁగలిగిన విద్యాసంస్థల పరిపాలనము ననుసరించి రవీంద్రుఁడు శాంతినికేతనమునఁ గొన్ని క్రొత్తయేర్పాటులు చేసెను. పోకిరి పిల్లలని పేరు పడినవారు పోలీసులచిట్టాల కెక్కినవారు బాగుపడుటకెట్టి పాఠశాల లుద్దేశింపఁబడినవో యట్టివెన్నో రవీంద్రుఁడు కని వచ్చినవాఁడగుటచేత, నేతద్విజ్ఞానము నుపయోగించి

యతఁడు శాంతినికేతన విద్యాలయము నడపెను. దుష్టులనియుఁ దెలివిమాలిన బాలురనియు దూరీకరింపఁబడుచుండిన యువకు లెందఱో శాంతినికేతనస్థులై సాధువులు సుగుణులు వివేక వంతులుగా జనాదరణమునకుఁ బాత్రులై తమకుఁదా ముప యోగపడి లోకమున కుపకారకులైరి.

శాంతినికేతనవాసు లహింసావ్రతులు కావలయుననుట రవీంద్రుని ప్రథమాశయము. సర్వభూతములందును దయ గలిగి వర్తించుట శాంతినికేతన విద్యార్థులు నేర్చుకొనిన మొదటిపాఠము. పెద్దలపట్ల భక్తి నెఱపుట వారి కత్యభ్యాస ముతో నలవాటయ్యెను. ఏ భాష మాటాడువారినైనను గౌరవముతోఁజూచి సోదరమర్యాదతో నాదరించుట వారల వఱచుకొనిరి. అనుదినము పదునైదు నిమిషములపాటు సూర్యోదయవేళయందును సూర్యాస్తమయసమయము నను మౌనముతోఁ గూర్చుండుట రవీంద్రుఁడు విద్యార్థులకు గఱపెను. పావుగంటసేపు మాటాడకుండఁ గూర్చుండిన పిదప విద్యార్థులెల్లరును గుమిగూడి యైకకంఠ్యముగా నొక ప్రార్థనాగీతము పాడుట శాంతినికేతనపద్ధతియయ్యెను. ఏ మతము వారైనను నిరాక్షేపముగా నుచ్చరింపఁదగిన పద బంధముతో భాసిల్లు గీతిక లల్లి రవీంద్రుఁడు విద్యార్థి ప్రార్థ నోపయోగమునకై యిచ్చుచుండెడివాఁడు.

విద్యాలయము నెలకొల్పినపిదపఁ గొన్ని సంవత్సరములు రవీంద్రుఁడు విద్యార్థిజనులనుండి జీతములు పుచ్చుకొనలేదు. ద్రవ్యములేనిదే పాఠశాలలు నడపు టెట్టివానికేని శక్య మగునా? రవీంద్రుని యిల్లాలు మృణాళినీదేవి తన యాభర

ణాము లమ్మి వి త్తమిచ్చినది. పతుల మతి గుర్తించి వర్తించు టయేకదా భారతీయసతుల పరమధర్మము!

1902లో మృణాళినీదేవి వ్యాధిగ్రస్తయై, రవీంద్రుని దుర్భర దుఃఖసాగరమున ముంచి పరమపదమునందినది. పత్నీ వియోగమునుగూర్చి రవీంద్రుఁడు 'స్మరణ' మను గ్రంథ మొకటి రచించినాఁడు. ఆ రచనము నరయుదుమేని రవీంద్రుని సతీమరణసంతాప మెంత తీవ్రమైయుండినదో గ్రహింపఁ గలుగుదుము. భార్య మరణించినపిమ్మట నచిరకాలముననే యతని పుత్రికకు- రేణుకకు అస్వస్థత యేర్పడెను. ఆమెకొఱకై రవీంద్రుఁ డెంతో శ్రమించెనుగాని యాతనిశ్రమ ఫలింపలేదు. తల్లి గతించినయాఱుమాసములకే రేణుక చనిపోయెను. మఱుసటి వత్సరమున రవీంద్రునికి మఱియొక విపత్తి కలి గెను. ఆతని సఖుఁడు ప్రేమపాత్రుఁడు శాంతినికేతన విద్యా లయోపాధ్యాయుఁడు సతీశచంద్రుఁడు పరలోకగతుఁ డయ్యెను. సతీశునియెడ రవీంద్రుఁ డత్యంతగౌరవముఁ జూపు చుండెడివాఁడు. సతీశుఁడు మహాకవి కాఁగలవాడని రవీంద్రుఁ డాశించియుండెను. కాని దైవము సతీశునిఁ జిన్నవయస్సునఁ గొంపోయినది. సతీశుఁడు మృతుఁడైన యావలిసంవత్సర ములో రవీంద్రునిరెండవకుమారుఁడు శమీంద్రనాథుఁడు- పదుమూఁడేండ్లవాఁడు మృతినందెను. ఇన్ని విపత్తులు- ఒక దానివెంట నొకటి వెన్నంటితటిమి రవీంద్రుని హృదయమున కాఘాతములు కలిగించెను. కాని జగత్సృష్టియంతయు సత్య సౌందర్య సౌజన్యమయముగానే రవీంద్రుని దృష్టికి గోచరించు చుండెను. ఆయన మహిమ కిదియే బలవన్నిదర్శనము కాదా!

శ్రీ

# గురుదేవ చరిత్రము

## తురీయోల్లాసము

రవీంద్రునికిఁ బరోపకార పరాయణత్వము పుట్టుకతోఁ బుట్టినగుణము. 1899 లోఁ గలకత్తా పురమునను దత్పరిసరములను 'ప్లేగు' జాడ్యము రేఁగి బహుళసంఖ్యాకుల ప్రాణములు హరించినప్పుడు రవీంద్రుఁడు చేసిన మానవసేవ మఱచిపోరానిది. వెల్లువలు నదుల వఱదలు కాటకములు బంగాళా రాష్ట్రమును బహువిధములఁ బలుమాఱులు బాధించుట పరిపాటిగా జరుగు ప్రకృతికార్యము. అట్టి సంకటముల యందల్లాడు తోడిమానవులకు రవీంద్రుఁడు చేతనైనంత సాయము చేయుచునే జీవితము గడపినాఁడు. 'బీహారు' భూకంపము వలనఁగలిగిన నష్ట మింతింతయని లెక్కింపరానిదిగదా! 'క్వెట్టా' భూకంపము కారణముగాఁ దారసిల్లిన ప్రాణహానిగాని యాస్తిపాస్తుల కమరిన వినాశముగాని గణించుట మన కలవికానిది. ఈ విధములైన తబ్బిబ్బులలో దెబ్బదిననవారికి విధిగాఁ బ్రభుత్వమిచ్చుతోడ్పాటు తోపాటు వెలలేని యుపకార మొనర్చిన యుదారహృదయు లెందఱోకలరు. వదాన్యులకడ కరిగి వారి యీవులు ప్రోవుచేసి, యాపన్నుల కందిచ్చు సచ్చరిత్రులు సంఘసేవా దక్షులు కరుణాపరులైన కార్యశూరులుగదా యీ మడామతాది దేశోపద్రవఘట్టములలో రాష్ట్ర

రక్షకులు! రవీంద్రుఁ డీపుణ్యాత్ముల శ్రేణిలో గణ్యుఁడు. విపన్నుల కీతఁ డీడులేని యూఁడిగము చేసినాఁడు. ఆర్తుల కృతజ్ఞతకుఁ బాత్రుఁడైనాఁడు.

భారతీయులచే నిర్మితములైన వస్తుజాతములను బహుళ ప్రచారమునకుఁదెచ్చి తన్మూలమున స్వదేశ పారిశ్రామికుల జీవనమునకు దోహదము గలిగింప యత్నించిన వారిలో రవీంద్రుఁడు ముఖ్యుఁడు. అతని భాగినేయులు 'కుష్టియా' యనుచోట నొక జనపనార కర్మాగారమును చెఱకు పరంజయంత్రశాలను నెలకొల్పిరి. ఆయన మిత్రులు కొందఱు కలకత్తా నగరమున స్వదేశీయవస్తువిక్రయాలయము సాగించిరి. ఈ వస్తు విక్రయ వ్యాపారమునకు రవీంద్రుఁడు పెట్టుబడి పెట్టెను. కొన్నిదినము లీవ్యాపారములు జరిగినవి: కాని దురదృష్టవశమున నివి నష్టముఁదెచ్చినవి. వీని మూలమున రవీంద్రుని మదిలోఁగొంత యశాంతికలిగెను. ఈ నష్టము రాకుండిన శాంతినికేతన విద్యాలయ కార్యక్రమమునకు ద్రవ్యాభావ మొదవియుండదు.

రవీంద్రుఁడు 'భాండార' మను వార్తాపత్రికకు సంపాదకుఁడై యుండినకాలమున దానియం దొకవ్యాసమువ్రాసి ప్రచురించెను. ఆంగ్లేయుల భరతఖండ పరిపాలనములో సిద్ధమైన యనర్థపరంపరలలో స్వదేశవాణిజ్య వినాశము ప్రధానమైనదని రవీంద్రుఁ డావ్యాసమున నిరూపించెను. స్వదేశ మాండలిక సంస్థానాధీశ్వరులు భారతీయ పరిశ్రమల కాలంబనమిచ్చుట పరమధర్మమని యుపన్యాసము లొసంగి వ్యాసములు ప్రకటించి యతఁడు సాటిలేని దేశసేవ కావించెను.

వంగరాష్ట్ర విభజనము జరిగిన సందర్భమున దేశభక్తులందఱు ప్రభుత్వచర్యను నిరసించినవారే. ఈ విభాగము మాతృదేశమున కొదవిన యపచారమని వంగదేశజు లెల్లరును భావించిరి. రాష్ట్రమున నానాస్థలముల సభలు ప్రవర్తిల్లినవి. పరిపాలకులొనర్చిన యీపని యకార్యమని రాష్ట్ర ప్రజలు తమ యభిప్రాయము నిర్భయముగా వెల్వరించిరి. రవీంద్రుఁడు రాష్ట్రవిభజనమును ఖండించినవారిలో ముఖ్యుఁడయ్యెను: దేశభక్తి ప్రపూరితములైన గీతములు రాష్ట్ర విభజనఖండనాత్మకమైన గేయములు రచించి ప్రజానీకముచేఁ బాడించెను. వీని మూలమున జనులలో రవీంద్ర కృతులకుఁ బలుకుబడి హెచ్చెను. ఉద్రేకము రేకెత్తించుచు తన జాతీయగీతిక లుచ్చైర్ఘుష్టముగా నాలపించు వేలకొలఁది నాగరకజనులను వెంటఁబెట్టుకొని రవీంద్రుఁ డూరేగింపులు జరిపెను. రాష్ట్రవిభజనమును రూపుమాపుటకై పోరునిమిత్తమొక పెద్దసభ నేర్పఱచి యా సమావేశములో రవీంద్రుఁ డేబదివేల రూప్యములు ప్రోవుచేయఁగలిగెను. ఈ ద్రవ్యముతో రవీంద్రుఁడు పట్టుదలనూని పనిచేసి విభక్తమైన రాష్ట్రము నొకటిచేయవలయునని సంకల్పించెను. భారతీయ సంఘసౌధమును స్థిరమైన పునాదిమీఁద నిర్మింప యత్నించెను: ప్రజానీకము ప్రభుత్వమునకుఁ దోడ్పడని విధానమునకు వ్యాప్తి కలిగించి యీ క్రొత్తదారిఁద్రొక్కి కాంక్షితము సాధింప నుద్యమించెను. ఈ పద్ధతియే పిమ్మట గాంధిమహాత్ముని యసహాయోద్యమముగా జగద్విఖ్యాతమైనది.

రవీంద్రుని యీ మార్గమున నడచుట మందగమన మనియు శీఘ్రఫలప్రదము కాదనియు దండోపాయ మవలంబించుటయే సత్వర స్వరాజ్యసిద్ధికి దారిచూపుననియు విశ్వసించి యువ లనేకులు విప్లవసమ్మతమైన కూట మొకటి రహస్యముగా నెలకొల్పిరి. దీనికి రవీంద్రుఁ డిష్టపడలేదు. ఈ కారణమున రవీంద్రునియెడ విప్లవపక్షావలంబకుల కభిమాన మభావమగుటే కాక ద్వేషము వర్ధిల్లసాగెను. ఈపరిస్థితులలో రవీంద్రుఁడు రాజకీయరంగమునుండి నిష్క్రమించి శాంతినికేతనము చేరి విద్యావ్యాసంగములో నిమగ్నుఁడయ్యెను. ఆతని తత్త్వము నవగాహన మొనర్చుకొనలేక పరుషవాక్కు లుపయోగించి నిందించిన వారుండిరి. అతఁడు దేశద్రోహియనియు విశ్వాసఘాతుకుఁడనియు దూషించినవారును గలరు. అంతమాత్రమున మహనీయచరిత్రుఁడైన రవీంద్రుని శీలమునకు మాలిన్య మంటునా?

రాజకీయవిషయములలో హిందువులపక్ష మొకటియు మహమ్మదీయులపక్షము మఱియొకటియు బయలుదేఱుట రవీంద్రునికి సమ్మతము కాదు. జాతిమతములు పాటింపక భారతీయులందఱు దేశాభ్యుదయమునకై పాటుపడవలయునని రవీంద్రుని యభిప్రాయము. 1908 లో వంగరాష్ట్రీయ రాజకీయ మహాసభ కతఁ డధ్యక్షుఁడై, భిన్నపక్షముల వర్తనము వలన దేశమున కొదవనున్న యనర్థములను మండలీయులకు సూచింపఁగలిగినాఁడు. మాతృభూమికి నిష్కళంకమైన సేవ చేయఁదలఁచినవారు పల్లెటూళ్లకరిగి నలుగురైదుగు రొక జట్టుగా నేర్పడి సంఘమున కూడిక ముచేయవలయుననియు,

నొక్కొక్క జట్టులో హిందువులే కాక మహమ్మదీయులును గలసిమెలసి పనిచేయనిచోఁ బ్రయోజనము లేదనియు, జనపదములందు వసించు హిందువులకును మహమ్మదీయులకును మైత్రి విశ్వాసములు వర్ధిల్లఁజేయుట విధియనియు రవీంద్రుఁడు బోధించెను. తా నేమతమవలంబించినను మనుజుఁడు తోడి మానవులయెడ నవలంబించి యనుష్ఠింపవలసిన ధర్మములు కొన్ని కలవనియు, నవి జనసామాన్యమున కనవరతా చరణీయములనియు రవీంద్రుఁడు హెచ్చరించెను. గాంధిమహాత్ముని యుపదేశములకును రవీంద్రుని సిద్ధాంతములకును భేదమిసుమంతయు లేదు. గాంధిమహాత్ముఁడు రంగమునకువచ్చుటకుముందే, రవీంద్రుఁడు చక్కని దారిఁజూపి భారతీయులకు నిరపాయమైన వర్తనము సూచించినాఁడు.

---

శ్రీ

# గురుదేవచరిత్రము

## పంచమోల్లాసము

1908 నుండి రవీంద్రుఁడు రచించి ప్రకటించిన కవిత్వము త్తమోత్తమ పరిగణనము నందఁగలిగినది. అతఁడే బంగాళీ నుండి యాంగ్లమునకుఁ గొన్ని కవితాఖండములను 'గీతాంజలి' యనుపేరుతోఁ బరివర్తించినాఁడు: 'ప్రాయశ్చిత్తము' అను రూపకమును వెలువరించినాఁడు. 1910 లో నీరూపకము శాంతినికేతనమున వేలుపుకంటిజన్మముగాఁ బ్రదర్శితమయ్యెను. 1911 లో రవీంద్రుని కేఁబదవయేఁడువచ్చెను. ఈ సందర్భముంబురస్కరించుకొని శాంతి నికేతనస్థులు రవీంద్రుని జన్మదినోత్సవము నమితోత్సాహముతో జరిపిరి. ఒక్క శాంతినికేతనమునం దేకాదు, బంగాళా రాష్ట్రమునందాయన జన్మదినము పండుగదినమయ్యెను. ఆనాఁ డనేకస్థలముల రవీంద్రుని భక్తులు మిత్రులు ఛాత్రులు నిండారిన నెమ్మితోఁ బండువు గావించుకొని విందులుచేసికొని పాటలు పాడుకొని యతనింగూర్చిన యభినందన కార్యక్రమము ప్రవర్తిల్లఁజేసిరి: ఆతని రూపచిత్రమునకు మెఱవడులు దీపింపఁజేసిరి. రవీంద్రుఁడు వంగరాష్ట్రీయ జాతీయకవి యన్న పేరెన్నిక యానాఁటికి నిష్పన్నమయ్యెను. 1912 లో బంగాళా రాష్ట్రసారస్వత పరిషత్సభ్యసంఘము కలకత్తా పురమందిర

మున మహాసభలో రవీంద్రునికిఁ బ్రతిష్ఠాపత్రము సమర్పించి నది. ఆనాఁడు విద్వత్పరిషన్ముఖమున వెల్వడిన జయజయ ధ్వానములచే రవీంద్రుఁడు కవీంద్రుఁడని నిరూఢమయ్యెను.

ఆవల నచిరకాలమునకుఁ గలకత్తా బ్రహ్మసమాజ మందిరమునఁ జరిగిన మాఘోత్సవ సందర్భమునఁ దన నవీన రచనమైన జాతీయగీతముం బాడి వినిపించి యతఁడు మితిలేని మన్ననఁ బడయఁగలిగెను. నేఁటి మన జాతీయగీతముగా జగద్విఖ్యాతమైన 'జనగణ మన అధినాయక జయహే' యను పలుకులతోఁ బ్రవర్తిల్లుగేయ మిదియే!

1912 మేనెలలో రవీంద్రుఁడు లండను నగరమునకుఁ బయనమై పోయెను. అప్పటికే యతని కచ్చట మిత్రులుండిరి. వారిలో 'విలియం రాథెన్ స్టెయిను' పండితుఁడు ముఖ్యుఁడు. అతఁడు గొప్ప కలావిదుఁడు. కొన్నిసంవత్సరములకు ముందు కలకత్తా కతఁడు విచ్చేసినపుడు 'జోరసంకో' భవనమున కరుదెంచి రవీంద్రుని దర్శనము చేసికొనిపోయినవాఁడు. రవీంద్రుఁడు లండనులో రాథెన్ స్టెయిను పండితునిఁ గలసికొనెను. ఆతఁడు 'మీ రచనముల కాంగ్లభాషాంతరీకరణము లేవేని కలవా?' యని యడిగెను. 'కల' వని రవీంద్రుఁ డతనికి 'గీతాంజలి' యాంగ్ల పరివర్తనముఁ జదివి వినిపించెను. ఆతఁడు పరమానంద భరితుఁడయ్యెను. వెంటనే యతఁడు తన కత్యంత మిత్రుఁడైన మేటికవి 'యీట్సు' పండితుని కడ కరిగి 'గీతాంజలిఁ' జూపెను. యీట్సుమహాశయుఁడు గీతాంజలిఁ జదివి రవీంద్రుఁడు విశ్వకవి యని గుఱుతింపఁ గలిగెను.

పిమ్మటఁ గొన్ని దినములకొకనాఁడు రాథెన్‌స్టెయిను పండితుఁడు తన బసలో సుప్రసిద్ధాంగ్లేయ రచయితలనందఱు నాహ్వానించి యొక సాహిత్యగోష్ఠి కూర్చెను. సహృదయ బృందమునకు రవీంద్రుని గీతాంజలి యాంగ్లానువాదము 'యీట్సు' పండితుఁడు చక్కఁగాఁ జదివి వినిపించెను. పఠనము ముగిసిన పిదపఁగూడ శ్రోతలు నోరుమెదల్పక యట్లే కూర్చుండియుండిరి. తన రచనము సభాసదులమది కాహ్లాదము గొల్పలేదుకాఁబోలునని రవీంద్రుఁడు శంకించెను. ఆమాట యనుటకన్న అతనిగుండె నీరయ్యెననుట యథార్థమగును. మఱి నిముసములో శ్రోతల హృదయములు బయల్పడినవి. వారి చిత్తములందు రవీంద్రుని కవిత్వము నెడ వాకొనరాని భక్తిప్రపత్తులు రేకెత్తినవి. విఖ్యాత గ్రంథమాలా సంపాదకుఁడు - 'ఎర్నెస్ట్ రైస్' పండితుఁడును, ఢిల్లీ పురి క్రైస్తవ కలాశాలోపన్యాసకుఁడుగా బహుసంవత్సరము లుండిన 'ఫ్రీయర్ ఆండ్రూస్' పండితుఁడును రవీంద్రుని కా దినమునుండి ప్రాణస్నేహితులైరి. పిదప శాంతినికేతన విద్యాలయమునం దుపాధ్యాయుఁడై 'ఆండ్రూస్' పండితుఁడు పెక్కేండ్లు రవీంద్రుని విద్యాప్రచార విధానములకు సహకార మొనరించెను.

1902 కు మునుపు రవీంద్రుని కింగ్లండు దేశమునఁ బేరు ప్రతిష్ఠలు లేవు. 'రాథెన్‌స్టెయిను' పండితుఁడు కూర్చిన గోష్ఠి నాఁటినుండియు రవీంద్రుని కనేక స్థలముల విందులుజరిగెను. ఆయా సమావేశముల కరుదెంచిన విద్వన్మణుల శ్రోత్ర పరిచయము రవీంద్రునికి లభించుచుండెను. 'గీతాంజలి' ప్రక

టితమయ్యెను. ఆంగ్లేయప్రపంచమున దానికి బహుళ ప్రచార మబ్బెను. రవీంద్రుఁడు మహాకవియే కాదు, బ్రహ్మవేత్తయు నని యింగిలీషు విద్వాంసులు పలువు రభిప్రాయపడిరి.

రవీంద్రుఁ డావల కొంతకాలమున కమెరికా ఖండమున కరిగి 'చికాగో' నగరమునందును 'హార్వర్డ్' విశ్వవిద్యాలయమునందును భారతీయ ప్రాచీన నాగరికతను గుఱించియు జాతివైషమ్యములనుగూర్చియు మహోపన్యాసము లొసంగెను. ఆ వాఙ్ముఖములన్నియు 'సాధన' యనుపేరుతో గ్రంథాకృతి నొందినవి.

1913 లో రవీంద్రుని సారస్వతప్రశస్తి గుఱితించి 'స్వీడిష్‌ట్రస్ట్' కార్యనిర్వాహక వర్గమువారు నియమించిన పరీక్షాధికారు లాతనికి 'నోబెల్' బహుమానమిచ్చునట్లు నిర్ణయించిరని వార్తాపత్రికలు ప్రకటించినవి. యూరపుఖండ నివాసికానివాఁ డీ బహుమతి నంతకుముందెవ్వఁడును సంపాదింపఁగలిగినదిలేదు. ఈ మహా బహూకరణమునకు రవీంద్రుఁడు పాత్రుఁడు కాఁగలిగినందులకు భారతీయులందఱు పరమానందము నందిరి. ఆ సంవత్సరమే కలకత్తా విశ్వవిద్యాలయమువారు రవీంద్రునికి 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' బిరుదమిచ్చి సన్మానించిరి. పిమ్మట రెండేండ్లకు బ్రిటీషు ప్రభుత్వమువారు రవీంద్రునికి 'నైట్‌హుడ్' (knight-hood) ప్రసాదించి తమ యభినందనమునకును బాత్రునిఁగావించిరి. ఇట్టి విశ్వస్తుతికి హేతువు గీతాంజలియే.

1916 లో రవీంద్రుఁడు జపానుదీవులు చూచిరాఁబోయెను. జపాను ప్రభుత్వమువారతని కఖండ స్వాగతమిచ్చి

గౌరవించిరి. ఆయననుగూర్చిన యభినందన సభ లనేకములు జరిగెను. ఆయన కవితామహత్త్వము జపాను పండితు లగ్గలమైన పేరిమితో నుగ్గడించిరి. జపానుదేశీయులు సౌందర్యోపాసకులు. ఆదేశపు కవులు కళావేత్తలు రవీంద్రునికి మిత్రులైరి. 'టోకియో' విశ్వవిద్యాలయమునఁ బనిచేయు విద్వాంసులనేకులతో నతనికిఁ బరిచయ మేర్పడెను.

జాతీయతనుగూర్చి రవీంద్రుఁడు 'టోకియో'లోఁ గొన్ని యుపన్యాసము లొసంగెను: జాత్యహంకారము నాతఁడు తీవ్రముగా ఖండించెను. పేదల బాధలను సరకుసేయని ప్రభుత్వవిధానమును విమర్శించెను. తమ దేశము నభివృద్ధికిఁ దెచ్చుటకై, తాము విత్తము నార్జించుటకై, స్వీయాధికారము పెంపొందించుకొనుటకై యొక్కొక్క ప్రభుత్వ మవలంబించు పద్ధతిని నిరసించి, యొక్కొక్క పరిపాలకవర్గము చేయు దుండగముల నధిక్షేపించి రవీంద్రుఁడు నిర్భయముగా మాటాడెను. చీనా ప్రజలకు జపాను ప్రభుత్వము కావించిన యన్యాయమును రవీంద్రుఁడు మోమోటము పాటింపక నిందించెను. స్వీయ విజయమో లేక స్వకీయైశ్వర్యమో ప్రధాన ప్రయోజనముగా ముఖ్యలక్ష్యముగా వర్తించుచు, ధర్మాధర్మముల ప్రసక్తి యెత్తుకొనని దేశప్రభుత్వము గొప్పది కాదనియు, నట్టి పాలనమునకు లోఁబడిన ప్రజ లెన్నఁటికిని సుఖింపలేరనియు రవీంద్రుఁడు నొక్కి వక్కాణించెను. ఈ భావములు వెల్లడించిన రవీంద్రునియెడఁ జపానుదేశీయుల కాదరము మందగించెను. నిజము నిష్ఠురతకు హేతువుగదా!

ఇంటి పట్టుఁజేరి రవీంద్రుఁడు సారస్వత పరిశ్రమములో మునిఁగెను. మాతృభాషలో విద్యార్థులకుఁ జదువులు చెప్పఁదగునని విసువులేని ప్రబోధమును రవీంద్రుఁ డొనరించెను: వ్యావహారిక భాషలో గ్రంథములు వెలువడ వలయునని ప్రచారముచేసెను: అట్టిభాషలో గ్రంథరచన మొనర్చు వారికిఁ జేతనైన సాయము సలుపఁజొచ్చెను. రవీంద్రుని భవనము సారస్వతోపాసకులకు సమావేశస్థానమయ్యెను.

భారతదేశీయ రాజకీయ మహాసభలో రవీంద్రుఁడు ప్రముఖసభ్యుఁ డయ్యెను: తన యుదాత్త జాతీయగీతికల మూలమున సామాన్యప్రజల హృదయములయం దతఁడు దేశభక్తి రేకెత్తించుచుండెను.

బ్రిటిషువారి యేలుబడిలోనుండిన భారతదేశ చరిత్రమునం దేనాఁటికిని విస్మరింప వీలులేని విద్వర మొక్కటి 1929 ఏప్రెలు నెల పదుమూడవనాఁ డుపాగతమయ్యెను. పంజాబురాష్ట్రమున 'జలియనువాలాబా' గను ప్రదేశమున డయ్యరు సేనాని తన పటాలముచేఁ గొన్నివందల భారతీయ ప్రజలను - స్త్రీ పురుషులను బాలబాలికలను గాలిపించి చంపించెను. గాయపడి చావక కొనయూపిరితో ననేకులు మిగిలిరి. ఆ రాష్ట్రమున కధీశ్వరుఁడు నిరంకుశుఁడై సైనిక శాసనమును రాష్ట్రమునఁ బ్రవర్తిల్లఁజేసెను. అప్పట్టున భారతీయుల కుప్పతిల్లిన ముప్పులు, దొరఁకొన్న దురంతము లవాచ్యములు. ఆ ఘోర వృత్తాంతములఁ బ్రకటించుటకు సైతము భారతీయులకు స్వాతంత్ర్యము లేకపోయెను. వీనులఁబడిన విషయములు రవీంద్రునికి దుర్భరములయ్యెను. పంజాబు

హత్యలనుగూర్చి బహిరంగసభ జరుగునేని, తాను దాని కధ్యక్షత వహింతునని రవీంద్రుఁడు సూచించినను, సమావేశము జరుపుటకుఁ గంకణము కట్టుకొనువారే లేరైరి. రవీంద్రునియత్నము కొనసాగలేదు. పరిపాలకుల చర్యలు ఖండింపనెంచి సభ నేర్పాటు చేసినవారినిఁ బట్టి బంధించి ప్రభుత్వమువారు కారాగారమున వేయుదురని ప్రజలు దద్దఱిల్లిపోయిరి. రవీంద్రుఁడు తన పూనికను మానుకొనలేదు. డయ్యరు సేనాని చేసిన కఠోరచేష్టితమును నిరసించుచుఁ బంజాబు రాష్ట్రాధికారి 'ఓడ్వ్యయరు' కావించిన విధ్వంసపు దుండగమును ఖండించుచు రవీంద్రుఁ డొక పెద్ద జాబువ్రాసి, బ్రిటీషు ప్రభుత్వము మున్ను దన్ను గౌరవించి తనకిచ్చిన 'సర్' బిరుదమును నాఁడు తా నభివ్యక్త మొనరించిన యభిప్రాయమునకు నిదర్శనముగా రవీంద్రుఁడు పరిత్యజించెను. స్వీయదేశీయు లనేకులు మానవుల కనర్హములైన రీతుల హింసింపఁబడుచుండఁ దానుమాత్రము గౌరవసూచకమైన బిరుదులు ధరించుట సిగ్గుపాటు కావున బ్రిటిషువా రిచ్చిన బిరుదును వారికే ప్రత్యర్పణము చేయుచున్నానని రవీంద్రుడుఁ 'వైస్రాయికి' వ్రాసిపంపినజాబులో స్పష్టీకరించెను. రవీంద్రుని దేశభక్తికి మూదల యనఁదగిన యాజాబు చదువుదుమేని, దానిలోని పదబంధము భావపవిత్రత యేనాఁటికైన మన హృదయమాలిన్యమును వదలింప వలంతులై యున్నవి. ఆ లేఖము నిశ్చయముగా నొక యుదాత్త సారస్వత ఖండము.

శ్రీ

# గురుదేవ చరిత్రము

## షష్ఠోల్లాసము

విద్యార్థులకు విశ్వవిజ్ఞానమునందఁ జేయు గురుకులమే "విశ్వభారతి". అమరావతీ నలందా తక్షశిలాది నగరములఁ బూర్వము వర్ధిల్లిన విద్యానిలయములవంటిదొక సంస్థను స్థాపింప వలయునని రవీంద్రునికిఁ జిరకాలమునుండి తీవ్ర కాంక్షితముండెను: ఈకోరికను గొనసాగించు కొనుట జీవిత పరమార్థముగా భావించి మెట్టకేలకు గట్టిపట్టుదలతో రవీంద్రుఁడు 'విశ్వభారతి'కి స్రష్ట యయ్యెను. ప్రాగ్దేశముల భిన్న సంస్కృతులను వివిధభాషలను బహుముఖ సాహిత్యములను నానాగాన పద్ధతులను నేర్చినప్పుడే మానవునికి సంపూర్ణ సభ్యత లభించునని రవీంద్రుని విశ్వాసము. బంగాళా దేశస్థుఁడు తనభాష రమ్యమైనదని తన సారస్వత ముత్తమోత్తమమని తన సంగీత సరణి లోకోత్తరమని భావించుటలో దోషములేదు. అట్లే తమిళదేశీయుఁడు కర్ణాటక మండలీయుఁడు మహారాష్ట్రుఁడు ఆంధ్రుఁడు ఓఢ్రదేశస్థుఁడు స్వభాషాభిమానము వహించుట నింద్యముగాదు. భరత ఖండమునందెన్నో భాషలున్నవి. ఎన్నో మతము లున్నవి. స్వమతాభిమానము దూష్యమేటికగును? తాను మాటాడు భాసపట్ల భక్తిప్రపత్తులు వెలయించుటలో మనుజుఁడు సిగ్గు

పడవలసిన తగ్గుదల యేమున్నది? కాని యాంధ్రు లఱవలను అఱవ లాంధ్రులను ద్రవిడులు కన్నడులును దక్షిణాపథస్థు లౌత్తరాహులను ఔత్తరేయులు దాక్షిణాత్యులను ద్వేషించుట నిందించుట హేళన మొనర్చుట గర్హింపఁదగిన దురభ్యాసములు. ఈ చెడ్డ యలవాటులను రూపుమాపు బుద్ధితో రవీంద్రుఁడు 'విశ్వభారతి'ని వృద్ధినొందించెను. ఏమతము వారైనను ఏభాషవారైనను తమ బిడ్డలను విద్యాభ్యాసము నిమిత్తము 'విశ్వభారతి' కిఁ బంపు వసతులను రవీంద్రుఁడు కల్పించెను. ఒకేమందిరమునం దొకే భోజనశాలలో నందఱును భుజించునట్లును, ఒక్కొక్క ప్రాంతమువారి తిండి తీరు కట్టు బొట్టు నన్యప్రాంతీయులు మన్నించునట్లును రవీంద్రుడు కట్టుదిట్టము లొనర్చెను. అస్సాము రాష్ట్రపు మణిపుర నాట్యముతోపాటు తిరువనంతపుర ప్రాంతపు 'కథాకలి' నృత్యమును విశ్వభారతీ విద్యార్థులు నేర్చుకొనుట కవకాశములున్నవి. రవీంద్రుని నవ గాన పద్ధతియం దభిమానము కలవారు దాని నభ్యసింతురు. పురాతన సంప్రదాయాగత సంగీతము వలసినవారు దానినే నేర్తురు. పెక్కు తెగల చిత్రకళలకు శిల్పములకు విశ్వభారతి చోటిచ్చినది. రవీంద్రుఁడు నానాభాషలయం దుప్పతిల్లిన యుద్గ్రంథములఁ దెప్పించి విశ్వభారతీ గ్రంథాలయములం దుంచెను. గీర్వాణ భాషయం దుదయించిన మహాత్కృష్ట కృతులన్నియు నచ్చోటికి వచ్చి చేరెను. అరబ్బీ హిందీ పారసీక భాషలలో విరచితములై విఖ్యాతినందిన కబ్బము లచ్చటి కరుదెంచినవి.

వాఙ్మయ పరిశోధన మొనర్చు విద్యార్థులకు 'విశ్వభారతి' కల్పవృక్షమాయెను.

కొంతకాలమున కీ విద్యార్థిజనపారిజాతమునకు 'చీనా' సారస్వతశాఖ యొకటి చిగిరించి దిన దిన ప్రవర్ధమాన మయ్యెను. 'సిల్వియన్ లెవీ' యను ఫ్రెంచివిద్వాంసుఁ డొకఁడు 'విశ్వభారతి' ని జేరవచ్చి, రవీంద్రునికిఁ జేదోడు వాదోడుగా నేర్పడెను. చీనాదేశ సంస్కృతిని టిబెటన్ నాగరికతను 'విశ్వభారతీ' ముఖమున విద్యార్థిలోకమున కందఁజేయ నాతఁడు బద్ధకంకణుఁడయ్యెను. ప్రాగ్దేశీయ భాష లన్నిటియందును సిల్వియన్ లెవీ గొప్పపండితుఁడు. ఈతఁడు విశ్వభారతీ విపశ్చిన్మణులలో నొకఁడైన రెండుమూఁడేండ్లకు రవీంద్రుఁడు చీనాదేశమున కరిగి తిరిగి యుపన్యసించి యచ్చటి వారి యాదరమునంది నెయ్యము గడించి మెప్పువడసి యిల్లుసేరెను.

ఆసియా ఖండములోని మలయా జావా సుమిత్రా తైలెండు జపాను మున్నగు దేశములనుండి సేకరింపఁబడిన చిత్ర విచిత్రములైన వస్తువులెన్నో ‡ విశ్వభారతీ కలానిల యమున మనము చూడవచ్చును. బ్రిటిష్ దీవులనుండి యమె రికా ఖండమునుండి విద్యార్థులు విద్వాంసులు 'విశ్వభార తికి' విచ్చేసి యచ్చటఁ గాపురముచేసి దానిపేరు సార్థకము చేసిరి.

'విశ్వభారతి' లో జాతిమత విభేదములులేవు. హైందవ విద్యార్థులు సిక్కుయువకులు పార్సీబాలకులు మహమ్మదీయ

‡ Art School Museum.

మాణవకులు - అందఱు నొక్కే పంక్తిలోఁ గూర్చుండి భుజింతురు. భిన్నరాష్ట్రగతులయ్యు నేకీభావముతో నొక్కే యావరణమున వసింతురు.

ఒక్కొక్క మత వ్యవస్థను సంస్థాపించిన మహానుభావుఁ డొక్కొక్కదృష్టితో దానిని దిద్ది తీర్చినాఁడనియు, నొక మతమునవలంబించిన వా రన్యమతములవారి నీసడింపరాదనియు రవీంద్రుఁడు విద్యార్థులకుఁ బల్మా ఉపదేశించెను తమ మతముల విడువక వివేకముతో నితరమత రహస్యములర్థముచేసికొనుట పాడియని యతఁ డనవరతము తన కవకాశము కలిగినపుడెల్ల యువకులకుఁ దెలియఁజెప్పుచుండెను. ఒక్కొక్క సంవత్సర మొక్కొక్క మతప్రవక్త నుద్దేశించి స్మృతిచిహ్నోత్సవము శాంతినికేతనమున జరుపు నాచారమును రవీంద్రుఁ డేర్పాటుచేసెను. ఈ హేతువున జగతిలో జనించిన సమస్త మతముల వైశిష్ట్యమును గుర్తించుటకును ఆయామతముల స్థాపించిన మహనీయుల జీవితముల చరిత్రముల నెఱుఁగుటకును విశ్వభారతీ విద్యార్థుల కమూల్యావకాశము లేర్పడినవి.

శ్రీ

# గురుదేవచరిత్రము

## సప్తమోల్లాసము

విద్యాసంస్థలు పల్లెటూళ్ల పరిస్థితుల నరసి, సేకరించిన యనుభవమును జానపదజీవితగ్రంథుల విడఁదీయుటకు వినియోగింప వలయునని రవీంద్రుని యాశయము.

రవీంద్రనాథుని తనయుఁడు రతీంద్రనాథుఁ డమెరికా ఖండమున వత్సరత్రయము వసించి వ్యవసాయశాస్త్ర మభ్యసించివచ్చెను. అతనిసాయముతో శాంతినికేతన పరిసరములఁ గొంత వ్యావసాయిక వ్యాసంగ మొనర్పవలయు నని రవీంద్రుఁడు నిశ్చయించెను.

శాంతినికేతనము చుట్టుపట్టుల 'శాంతాల్' జాతి వారని పిలువఁబడువారు చిరకాలముగా వాసము లేర్పఱచుకొని యుండిరి. వారు మాటాడునది బంగాళీభాష కాదు. వారనుసరించునవి బంగాళాదేశీయుల యాచారవ్యవహారములకు భిన్నములైనవి. కష్టములకోర్చి పనిచేయగల మోటు మానిసులు వారు; మోసమెఱుఁగని మనః ప్రవృత్తులు గలవారు; నిండారిన సంతుష్టితో నిరవధికమైన చుఱుకుఁదనముతో జీవితముగడపువారు.

1913 లోనే శాంతినికేతనమునకు సమీపములో 'సురుళ్' గ్రామముయొక్క సరిహద్దులోనున్న యొక పెద్ద భవనమును రవీంద్రుఁడు విల్చియుండెను. ఆ యిల్లు రవీంద్రుఁడు తలపెట్టిన జానపదాభ్యుదయ ప్రయత్నమున కుపక

రించుసదయ్యెను. 'యల్. కే. యెలమ్ హార్స్టట్' అను ఆంగ్లేయ మహాశయుఁడు రవీంద్రు నుద్యమమునకుఁ దోడ్పడ సంసిద్ధుఁడయ్యెను. ఈ సంఘటనములన్నియు సమకూరుటం జేసి రవీంద్రుఁడు 1912 లో 'శ్రీనికేతన' మను పేరుతో నొక నూతన పారిశ్రామిక సంస్థను సంస్థాపించెను.

శ్రీనికేతనము పరిసరములనున్నభూమి సారవంత మైనదికాదు: కాని దాని నాశ్రయించి పనిచేయుచుండిన కృషికులు కష్టించి సత్తువలు సంతరించి క్రొత్తరకముల వరి పయిరులు సాగించి చెఱకుతోఁటలు పెంపొందించి ఫలింపఁ జేయ బహువిధముల యత్నించిరి.

నిష్కల్మషమయిన పాలు పెరుగు వెన్న నెయ్యి సేక రించు క్షీరసంపత్పరిశ్రమశాల యొకటి శ్రీనికేతనమునం దున్నది. ఇంతేకాదు, నానారీతుల పండ్లచెట్లతో నిండారిన యొకతోఁటగూడఁ గలదు. ఎట్టి ఫలవృక్షముల మొక్కలు మనకుఁ గావలసియున్నను శ్రీనికేతనమున లభించును. జాన పదుల యారోగ్యభాగ్యము రక్షించుట కేర్పడిన ప్రత్యేక శాఖ యీ నికేతనమునఁ గలదు. ప్రతి జానపద కుటుంబము సంవత్సరమున కింత మొత్తమని కొంతవిత్త మొక సహకార సంఘమునకుఁ జెల్లించును. ఈ విధముగాఁ బ్రోవుసేయఁబడిన ధనముతో నా సహకార సంఘ మొక వైద్యుని నియమిం చును. ఆ వైద్యుఁ డా సంఘములోఁ జేరిన యన్ని కుటుంబముల స్త్రీ పురుషుల బాలబాలికల యారోగ్యము నరయుచుండును. వైద్యుఁడు రోగుల యిండ్లకరిగి చికిత్స చేయవలసినప్పుడు రోగులనుండి యతఁడు గైకొను భృతి సహకార సంఘమునకుఁ

జెందును. వ్యాధులకుఁ జికిత్సచేయుటయే కాదు, వ్యాధులు రాకుండునట్లు జనులు వర్తించుట కనువైన పద్ధతులు వైద్యుఁడుపదేశించుటయు నతనివిధి. శీతజ్వరములవంటి వ్యాధుల వాతఁ బడకుండ జానపదులు మనుగడ సాగించుటకు శ్రీనికేతన మెంతేని సేవచేసినది. శీతజ్వర నివారణమును గూర్చి యెంతో శోధించిన వైద్య విద్యాప్రవీణుఁడు 'హ్యారీ టిమ్బర్స్' సకుటుంబముగా శ్రీనికేతనమునఁ జెక్కెండ్లు నివసించెను. ఆయనవలన శ్రీనికేతనప్రాంతప్రజలు పొందిన మేలు వెలలేనిది.

రవీంద్రుఁడు స్వచ్ఛంద రక్షకభటవర్గ మొకటి శ్రీనికేతనమున నెలకొల్పి జానపదులకు సాయపడఁజేసెను. అనుకూలమైనచోటఁ గృషికి యోగ్యమగు కయ్య లేర్పఱచుకొని సత్తువలు సంధించి కూరగాయలు పండించి యీ స్వచ్ఛంద రక్షకభటులు తన్మూలమున ద్రవ్యము చేకూర్చి తమ సాముదాయికమైన యక్కఱలకై వినియోగించుకొందురు. జానపదుల యారోగ్య భాగ్యములను శ్రద్ధాభక్తులతోఁబరిరక్షించుటయు వారియాపదలకడ్డుపడుటయు వీరివిధి.

జానపద బాలబాలికలు చదువుకొని బాగుపడుటకై రవీంద్రుఁడు పాఠశాలలు నెలకొల్పెను. ఏడెనిమిదేండ్లవయసు నుండి పదునైదు పదునాఱు వత్సరముల యీడువఱకుఁ బల్లెటూళ్ల పిల్లలీ పాఠశాలలయందు బంగాళాదేశచరిత్ర గణితము సారస్వతము భౌతికశాస్త్రవిశేషములు ప్రముఖ భారతీయ జీవితములు దైనందిన వార్తాదికములు చదివి తెలిసికొని లోకజ్ఞాన మార్జించుచుండిరి. జీవనము జరుపుకొనుట కుపకరించు నేఁతపనివంటివిద్యలు బాలబాలిక లభ్య

సించుటకు శ్రీనికేతనమున సౌకర్యము లున్నవి.

బడి విడిచిపెట్టి యిల్లుచేరినపిమ్మటఁ గూడ యువతీ యువకులకుఁ జదువు సంధ్యలతో సంబంధము తెగిపోవనీయని మంచి యుపాయము రవీంద్రుఁడు కల్పించెను. వివిధవిషయ ములను గూర్చిన పుస్తకములు చదువఁగోరువారియిండ్లకుఁ జేర్చి, చదివినపాత్తము లెత్తికొనిపోయి క్రొత్తవి తెచ్చి యిచ్చు కొలువుకూట మొకటి రవీంద్రుఁడు సృజించెను. ఇట్టి చదువుల కుపయుక్తములగు పుస్తకములు రచించెను. సంగతులు తేటగా సూటిగా సులువుగాఁ దెలుపు వార్తా పత్రిక నొకదానిని రవీంద్రుఁడు నడపెను. వయోజనవిద్యా వ్యాపనమున కీ పత్రిక సాధుసాధన మయ్యెను. చదువుట వ్రాయుట - ఇవిరెండే కావు వయోజన విద్యావిధానమునం దుండవలసినవి. జీవితమున మానవున కేది కర్తవ్యమో యేదికాదో యేదిమంచియో యేదిసెబ్బరయో నిర్ణయించు కొనుట నేర్చికొనినప్పుడే చదువుకొన్నందుకు ఫలము. కలు గును. ఈ విలువను జనులు గుఱుతింపవలయునని రవీంద్రుఁడు పట్టుదలతోఁ బరిశ్రమించెను.

శ్రీనికేతనమున రవీంద్రుఁ డొక శిల్పభవనమును నెలవుకొనఁజేసెను. అది వృత్తివిద్యాశాల. కొయ్యపని నేత పని చర్మవస్తువులుచేయుపని పుస్తకములుకుట్టుపని మట్టి పాత్రలుచేయుపని - మున్నగు వృత్తు లభ్యసింపఁదలచువారి కీ భవనము కామధేనువు. భారతదేశములోని జనపదము లన్నియు శ్రీనికేతనములు గావలయునని రవీంద్రుని యాశ యము. ఈ యాశాస్య మెన్నటికి ఫలించునోకదా!

శ్రీ

# గురుదేవ చరిత్రము

## అష్టమోల్లాసము

రవీంద్రుఁడు విశ్వపౌరుఁడు. ఒక భరతఖండమే కాదు, ప్రపంచమంతయుఁ బర్యటన మొనరించినవాఁడు. అతఁడే దేశమునం దేపురమున కరిగినను గుంపులు గుంపులుగా నతని దర్శనము చేయవచ్చువారి సంఖ్యకు మితిలేదు. ప్రతి పట్టణమునందును అతని యుపన్యాసములు వినఁగోరి విచ్చేయు వారిని లెక్కింప నలవిగాకుండెను. ఆయన కార్య క్రమముల కైడ తెలపిలేదు. ఆతఁ డెట కరిగినను స్వాగతోత్సవములతో నుత్సాహముతో నా విజ్ఞుని విదేశీయులు గౌరవించుచుండిరి.

1920 లో భరతఖండ పశ్చిమ ప్రాంతమంతయు రవీంద్రుఁడు సంచారము సాగించెను. మఱుసటి వత్సర మమెరికా యూరపు ఖండముల దర్శించెను: ఆ పై సంవత్సరము దక్షిణ భారత దేశమునను సింహళ ద్వీపమునను గల ముఖ్యస్థలములఁ దిలకించెను. 1923 లో 'కాథియవారు' 'అస్సాము' మున్నగు రాష్ట్రముల యందలి పెద్దపెద్ద పట్టణముల నాతఁడు చూచి వచ్చెను, 1924 లో 'చీనా' 'జపాను' అమెరికా దక్షిణార్థము నీక్షించివచ్చెను. 1925 లో నతఁ 'డిటలీ' కరిగి యచ్చటినుండి 'స్విట్జర్లెండు' 'నార్వే' 'డెన్మార్కు' 'జర్మనీ' 'జెకోస్లవేకియా' 'బాల్కను' ప్రాంతములు

'గ్రీసు' 'ఈజిప్టు' మొదలయిన దేశములన్నిటికిని విసువులేక వెళ్ళిచూచి వచ్చిన వాఁడయ్యెను. 1927 లో రవీంద్రుఁడు భరత దేశపు సంయుక్తరాష్ట్రములు మధ్యప్రదేశము దరిసించి పిమ్మట మలయద్వీపములు తైలెండు 'ఆర్చిపెలగో' దీవులు - ఇవన్నియు యాత్రచేసికొనివచ్చెను. 1928 లో దక్షిణాపథ మును సింహళమును బునస్సందర్శనము కావించెను. 1929 లో నతఁడు 'కెనడా' 'జపాను' 'ఫ్రెంచి ఇండోచైనా' చూచెను. 1930 లో నాతఁడు బరోడా సంస్థానమున కాహ్వా నింపఁబడి యచ్చటికరిగి మన్ననలందుకొని మందిరముఁ జేరెను. ఆసంవత్సరమే యతఁడైరోపా ఖండమునకుఁ బయ నమైపోయి యింగ్లండు జర్మనీ డెన్మార్కు రష్యా దేశ ములలో సంచారము జరిపి, యమెరికా ఖండమున కరిగి యచ్చటఁ గొంత కాలము గడపి యిండియా కరుదెంచెను. 1932 లో వాయువిమానమునఁ 'బర్షియా' కేగి షా గారి యతిథిగానుండి తిరిగివచ్చుచు దారిలో నిరాక్ దేశము చూచి వచ్చెను.

తనకు డెబ్బదియైదేండ్ల వయసు పైఁబడిన పిమ్మటఁ గూడ రవీంద్రుఁడు శాంతినికేతన నటవర్గమును వెంటఁబెట్టు కొని భరతఖండ ముఖ్యపట్టణముల కేగి వారిచే రూపక ప్రయోగములు కావింపించి తన్మూలమున విత్తమార్జించి విశ్వభారతి కిచ్చినాఁడు. బొంబాయి చెన్నపట్టణము వంటి ప్రధానరాజధాని స్థలములు లేకాక చిన్నపట్టణములెన్నో రవీం ద్రుని యాగమనభాగ్యము ననుభవించినవి. 1936 లో గాంధిమహాత్ముఁడు రవీంద్రకవీంద్రుని ఢిల్లీ పట్టణమునఁ గలసి

కొని, యీ కవితావయోవృద్ధుఁడీతీరున విశ్వభారతీ విద్యాలయము నిమిత్తము దేశదేశములు సంచరింపఁబోయి కాయకష్టమున కగ్గమగుట భారతీయులకు లజ్జాకరమని తలంచెను. చిత్తమునం దుత్తలపాటు నొందెను. వెంటనే యీమహాత్ముఁడొక్క యుదారపురుషునికిఁ జెప్పి యర్ధలక్ష రూప్యములు విశ్వభారతీదేవి యర్చనకై రవీంద్రుని కిప్పించెను. ఆమొత్తమర్ధలక్షకు మించిన మొత్తమని కొంద ఱందురు.

1920 లో రవీంద్రుఁడు యూరపుఖండమునఁ బర్యాటనము చేయునప్పటికి జర్మనీదేశము మొదటి ప్రపంచయుద్ధమున నిర్జితమైయుండినది. పేదఱికమున మలమల మాఁడిపోవుచుండినది. తన్నుజయించిన రాజ్యములకుఁ బరిహారముగా ననువత్సరము గొప్ప మొత్తముల విత్తముఁ జెల్లించుచుండినది. ఏదేశమువారుగాని జర్మనీవారికి సాహాయ్య మొనరింప నియ్యకొనరైరి. నిరపరాధులగు సామాన్యప్రజ లాదేశమునందనుభవించు కష్టపరంపరలను రవీంద్రుఁడు కన్నారఁగన్నాఁడు: చిన్నబిడ్డ లన్నములేక యల్లాడుట నతఁ డాలోకించినాఁడు. ఆతనిహృదయము ద్రవించినది. అతనికన్నులనుండి కరుణాశ్రుకణములు జలజల స్రవించినవి. జర్మనీదేశముపట్లఁ బ్రపంచము దయఁ జూపవలయునని రవీంద్రుఁడు వ్రాసి ప్రకటించినాఁడు. యుద్ధమునఁ దగిలిన గాయములను మాన్పఁగలిగిన మందు క్షమాగుణ మొక్కటియేయని రవీంద్రుఁ డుద్ఘోషించినాఁడు. ఇంగ్లండు ఫ్రాంసు దేశములయం దుండిన నాఁటి రాజకీయ నాయకులకు జర్మనీయెడఁ గరుణ కలుగలేదు. వారు జర్మనీ

దేశమును నిందించుచునే యుండిరి. క్షమించుట యనుమాట వారికి సమ్మతముగాని వాక్కు. జర్మనీదేశమును జయించిన రాజ్యములు జర్మనుల నక్కటికముతోఁజూచియుండినచో 'నాజీ' పక్షనాయకుల కధికారము వచ్చియుండదు. జర్మనులు పునస్సంగ్రామ ప్రయత్నములకుఁ బూనుకొనియుండరు. రెండవ ప్రపంచసంగ్రామము జరిగియుండదు. రవీంద్రునివంటి పురుషోత్తముల ప్రబోధముల నింగ్లండు ఫ్రాంసు అమెరికా దేశముల రాజకీయనాయకు లాలకింపకపోయిన కతమున విషమపరిస్థితు లేర్పడినవి. యుద్ధము రెండవతూరి సిద్ధమై ప్రపంచమును వినాశములో దించినది.

జర్మనీదేశములో రవీంద్రుఁ డున్నప్పుఁ డొకనాఁ డిద్దఱు బాలికలు కైదొన్నెలలోఁ బూవులుంచుకొని యతని సన్నిధి కరుదెంచిరి. వారిలో నొక్కర్తుక 'నేను భారతదేశమును బ్రేమింతును' అని పలికెను. 'ఏల?' యని యతఁడు ప్రశ్నించెను. 'మీరు భగవంతుని బ్రేమించుటవలన' అని యా బాలిక ప్రత్యుత్తరము వచించెను. ఈమాట రవీంద్రుఁడు తనజీవితమున మఱచిపోలేదు: స్వదేశమున కేతెంచిన తరువాత నాతఁడు జర్మనీదేశపుఁ జిన్నిపూఁబోణి ముద్దుపలుకులు పలుమాఱు స్మరించి యాత్మీయులతోఁ జెప్పి యా వాక్కులను గూర్చి యెంతో యోజించినాఁడు. భారతీయు లందఱు నిశ్చయముగా భగవంతునిఁ బ్రేమించు టేనాఁటికి సంఘటిల్లునో యానాఁడు భరతఖండము వైకుంఠ మగునని రవీంద్రుఁడు భావించినాఁడు: తనమిత్రులకీ భావముఁ దెలియఁజెప్పినాఁడు. భగవంతునిఁ బ్రేమించుదేశ మెప్పు డుదయిం

చునా ? యని విశ్వ మెదురుచూచుచున్నదని రవీంద్రుఁడు తన వాఙ్ముఖములలో నవకాశము లభించినపుడెల్ల సూచించినవాఁడే.

1924 లో రవీంద్రుఁడు చీనాదేశమునకరిగినప్పుడు యువకులు తొలుదొల్త హెచ్చుగా నతనియెడ నాదరము నెఱపరైరి. ఇంగ్లండులో నమెరికాలో నుండి, పెద్ద పెద్ద చదువులు చదివి భౌతికశాస్త్రజ్ఞాన మార్జించి వచ్చిన చీనావారు నవీన సంస్కృతి సంపన్నులుగా మరియువారు రవీంద్రుఁడు ప్రాఁబల్కుల వాఁడనియుఁ బాశ్చాత్య సంస్కృతిని విద్వేషించువాఁ డనియు భావించియుండిరి. కాని ఆయన యుపన్యాసము లాలకించిన పిమ్మటఁ దమయభిప్రాయములు మార్చుకొనిరి. రవీంద్రుఁడు సత్యాన్వేషి యనియు యాథార్థ్య మెచ్చటఁ గానవచ్చినను గ్రహించుననియు మూఢవిశ్వాసములకుఁ దావీయఁడనియు దృఢముగానమ్మిరి : ఆయనను మిక్కిలి గౌరవించిరి. డాక్టరు హూషీ, డాక్టరు లియన్ షిషౌ యను విద్వాంసు లిద్దరు రవీంద్రుని కఖండసమ్మానము చేయించిరి : ఆయన పూనిన పనుల కుత్సాహముతోఁ దోడ్పడిరి. వారి ప్రోది మూలమున శాంతినికేతనమునకు వచ్చి చదువు విద్యాభిలాషులసంఖ్య క్రమక్రమముగావృద్ధినందినది.

1927 లో రవీంద్రుఁ డిటలీ దర్శించినప్పు డాయన కిటలీప్రభుత్వ మాతిథ్య మిచ్చినది. ఆ దేశమునందలి ప్రముఖులందఱితో నతనికిఁ బరిచయము లభించినది ఇటలీ ప్రభువుతో నాతఁడు సంభాషించెను. 'ఫేసిస్టు' పార్టీ నాయకుఁడైన 'ముసాలోనీ' తో రవీంద్రునికి సమావేశము కుదిరెను.

ఇటాలియను భాషలోఁ బరివర్తనమునందిన రవీంద్రకృతు లన్నియుఁ దాఁ జదివి యానందింపఁ గలిగెనని మసాలోనీ మహాశయుఁ డభినందన పూర్వకమైన నిజాశయము ప్రకటించెను. 'బెనెడెటో క్రోస్' అను విఖ్యాత రచయితతో రవీంద్రుఁడు కొంతకాలము గడపెను. ఉభయులు స్వీయ విజ్ఞానానుభవములను బరస్పరము వినిమయము గావించుకొని సంతసించిరి.

రవీంద్రుడు 'రోము' నగరమున విద్యార్థులఁ గలసికొని వారితో భాషించి యనూనమైన వినోదము విస్తారమైన మోదము నందఁగలిగెను. వారి విద్యాలయ వార్షికోత్సవముఁ జూడఁబోయి, యందు వారొనరించిన బృందగానమును వినియమందానంద మనుభవించెను. తమ విద్యాభ్యాస కార్యక్రమమున రవీంద్రునిగూర్చి తాము వ్రాసిన వ్యాసములు వారాయనకు వినిపించిరి. తమ పుస్తకములలోఁ దాముగీచిన రవీంద్రుని రూపచిత్రముల నాతనికిఁ దెచ్చిచూపిరి. కొందఱు తమ పాత్రములను రవీంద్రునికిఁ బారితోషకములుగా సమర్పించిరి. ఆ పాత్రముల నతఁ డపారప్రీతితో దాఁచియుంచుకొని యప్పుడప్పుడు చూచుకొని హర్షించుచుండెడివాఁడు.

రవీంద్రుఁ డిటలీకేగిన దినములలో నా దేశ పరిపాలనము ఫేసిస్టుపక్షమువారి చేతిలో నుండినది. వార్తాపత్రికల ప్రతినిధులు కొందఱు రవీంద్రుని సన్నిధికి వచ్చి 'ఫేసిస్టు పక్షమునుగూర్చి మీ యభిప్రాయమేమి?' యని యడిగిరి. "ఇటలీ దేశపరిస్థితులు నాకేమియుఁ దెలియవు. ఇటాలియనుల నేఁటి మనస్తత్వము నేనెఱుఁగను." అని రవీం

ద్రుఁడు బదులు పలికెను. "ద్రవ్యార్జన పరాయణత్వమున మాత్రమే మీరు నిమగ్నులై యుండకుఁడు. అట్టి ప్రవృత్తి నూతగాఁగొని మీరున్నతి నొందఁజాలరు. లోకకల్యాణము నకుఁ దోడ్పడఁ గలవారే ధీరులు పూజ్యులును." అని రవీంద్రుఁ డిటలీ ప్రజలకుఁ దనమది నావిష్కరించెను. ఇటలీ నుండి యాతఁడు స్విట్జర్లెండు దేశమున కరిగి యచ్చటఁగల కొంద ఱిటాలియను పండితప్రకాండుల మైత్రిని సంపాదించు కొని వారితోఁ గొంతకాలము గడపెను:

'ఫేసిస్టు' పక్షపద్ధతులను రవీంద్రుఁ డాదరించిన వాఁడని కొన్ని వార్తాపత్రికలు ప్రకటించినవని స్విట్జర్లెండు మిత్రులతనికి నివేదించిరి. ఆ పక్షమునకుఁ జెందినవారి రాక్షస కృత్యములు మిత్రులవలన రవీంద్రుఁడు తెలిసికొనఁ గలిగెను. ఒక మహిళామణి ఫేసిస్టు దురంతములను రవీంద్రుని కన్ను లకు గట్టునట్లు వర్ణించెను. ఆయుదంతములు రవీంద్రునికి హృదయవిదారకములయ్యెను. ఇటాలియను వార్తాపత్రికలు తన యభిప్రాయముల సత్యస్వరూపమును మఱుఁగుపుచ్చిన వని రవీంద్రుఁడు కుపితుఁడయ్యెను. ఫేసిస్టుల చేష్టితములను గూర్చి తానేమి వచించెనో తనయభిప్రాయము లెవ్వియో తెలియఁజేయు పెద్దవ్యాసమొకటి వ్రాసి రవీంద్రుఁడు 'మాంచెష్టరు గార్డియను' పత్రికలోఁ బ్రకటించెను. దానిలో ఫేసిస్టుల దుర్ణయముల నతఁడు విశదమొనరించెను. ఎల్లప్పుడును దా నధర్మమునకు విరోధియే యని యతఁ డుద్ఘాటించెను. ఈ వ్యాసమున కిటాలియను పత్రికలు రవీంద్రునిపైఁ గినిసినవి.

స్విట్జర్లెండు నుండి రవీంద్రుఁడు జర్మనీకి బాల్కను ప్రాంతములకుఁ జని, యచ్చటి ప్రజానీకములిచ్చిన స్వాగతములు సన్మానములు గ్రహించి మిక్కిలి సంతోషించెను. ఆతఁడు వారి భాష నెఱుఁగఁడు. వా రాయన గ్రంథములు చదివినవారు కారు. కాని యా యా దేశములందలి సామాన్య ప్రజల హృదయములం దతఁడు వారికి బంధువన్న విశ్వాసము నాటుకొని యుండెను. రవీంద్రుఁడు దీనబాంధవుఁడుగదా!

1930 లో రవీంద్రుఁడు రష్యాదేశము చూడఁబోయెను. అచ్చటి విశేషములన్నియు నాతఁడు తన మిత్రులకు లేఖలమూలమునఁ దెలియఁజేసినవాఁ డయ్యెను. ఆ లేఖలన్నియు గ్రంథరూపము నొందినవి. 'సోవియట్ రిపబ్లిక్' రాష్ట్రముల యభ్యుదయమున కతఁ డబ్బురపోయెను. పది సంవత్సరముల పరిమితకాలముననే ప్రజల యారోగ్యము రక్షించుటకు సంపద వర్ధిలఁజేయుటకు రష్యా ప్రభుత్వము చేయఁగలిగినపని యత్యంతనుతిపాత్రమని రవీంద్రుఁడు వ్రాసెను. పలు తెఱంగుల విద్యలను బాలబాలికలభ్యసించుటకు సోవియెట్ పరిపాలకవర్గములు కల్పించిన వసతులు, ఏపరిశ్రమలో నెవ్వరు నిపుణులో వారాపని చేయుట కా దేశమునందొదవెడి యవకాశములు – ఇవన్నియు రవీంద్రుఁ డరసి యాశ్చర్యము నొందెను: ఆ దేశమును వీడివచ్చుటకు ముందు రష్యాప్రజల కార్యాచరణ దీక్షను గొనియాడెను. రష్యాలోవలె భారతదేశమునఁ బ్రజలకు విద్యాభ్యాస సౌలభ్యములు సౌకర్యములు, దైనందిన జీవితపరిశ్రమలలో నండఁ బను బాల్గొనుటకు సమానావకాశములు ఏనాఁడు చేకూ-

అనా యని తానెదురుచూచుచున్న ట్లుద్ఘాటించెను.

రష్యాదేశ పరిస్థితులలోఁ తనకిష్టముగాని విధాన మొకటి రవీంద్రుఁ డెత్తిచూపెను. కమ్యూనిస్టుతత్త్వముతో నేకీభవింపని మనఃప్రవృత్తి గలవారు తమయభిప్రాయముల బయల్పఱుపరాదను నిషేధము రవీంద్రునికి సమ్మతము గాకుండెను. అట్టి నిషేధము ప్రజాక్షేమ వృక్షమునకు వేరుపురుగని యాతఁడు స్వీయాశయమును నిర్భయముగా వెల్లడించి వచ్చెను.

'ఆస్ట్రేలియా' 'న్యూజిలెండు' ఆఫ్రికాలోఁ గొన్ని భాగములు తక్క ఈ ప్రపంచమున రవీంద్రుఁడు చూడని దేశములు లేవు. రవికిరణములు ప్రసరింపని ప్రదేశము ప్రపంచమున లేనట్లుఁ, దాఁ జరింపని చోటీ జగతిలో నుండరాదని యతని తలంపు. ఆయన డెబ్బదవ జన్మదివసమునాఁడు త్రిపురసంస్థానాధీశ్వరుఁడు రవీంద్రుని 'భారతభాస్కరు' డను బిరుదముతో నభినందించెను.

---

శ్రీ

# గురుదేవచరిత్రము

## నవమోల్లాసము

రవీంద్రునికి గాంధిమహాత్మునెడ భక్తిప్రపత్తులు మెండు. గాంధిమహాత్మునికి రవీంద్రునిపట్ల నత్యంత గౌరవము. ఇరువురును లోకబాంధవులే. ఇరువురును సత్యమూర్తులే. ఇద్దఱికి నహింసావ్రతము పరాయణము. ఇతఁడుకవి: అతఁడు యోగి. నవభారతమున కుభయులును సూర్యచంద్రులు.

1931 డిసంబరు నెలలో భరతదేశమునం దంతట రవీంద్ర జయంత్యుత్సవములు జరిగెను. కలకత్తా పురమందిరమున రవీంద్రుని నాటకములు ప్రదర్శితములయ్యెను. జగద్విఖ్యాత పండితులు రచించిన గద్య పద్యావళులతో రవీంద్రాభినందనగ్రంథ మొకటి ప్రకటితమయ్యెను. 1932 జనవరిలోఁగూడ నీ యుత్సవముల సాగింపవలసినట్లు రవీంద్రుని భక్తులు మిత్రులు సంకల్పించిరి. కాని యీ సంకల్పమున కంతరాయము కలిగెను.

జనవరి నాలుగవదినమున బ్రిటీషు ప్రభుత్వమువారు గాంధి మహాత్ముని బంధించి కారాగారమున వైచిరి. ఈ సంఘటనము రవీంద్రునికి గుండెతల్లడమయ్యెను. వెంటనే యాతఁడు జయంత్యుత్సవసంరంభము నిల్పివేయించెను. అంతేకాదు. లండను వార్తాపత్రికలలో మండనమైన 'టైమ్సు' కు

రవీంద్రుఁ డొక లేఖ వ్రాసి ప్రకటించెను. బ్రిటీషు ప్రభుత్వ చర్యలను మోమోటపడక ఖండించెను. ఆంగ్లేయులు భారతీయులను భారతీయు లాంగ్లేయులను నిష్కల్మషమైన హృదయములతో విశ్వసించి, వారి తప్పులను వీరు వీరి పొరలను వారు మన్నించి, యాదరస్నేహములఁ బెంపొందించుకొనకున్న ముక్తి లేదని రవీంద్రుఁ డుద్ఘోషించెను భారతీయులు తమ చిత్తవృత్తులు మార్చుకొనుటకుఁగాని, బ్రిటీషువారు తమ హృదయములకుఁ బరివర్తనము చేకూర్చుకొనుటకు గాని, తగిన పరిపాకము సమయము సమకూఱ లేదు. కాఁబట్టి రవీంద్రుని లేఖకు ఫలితము లేకపోయెను.

భిన్నమతావలంబకులగు భారతీయుల రాజకీయ శాసనసభా ప్రాతినిధ్యపు హక్కుల విషయమునుగూర్చి, బ్రిటీషు ప్రభుత్వమువా రనుసరించు § నిర్ణయము సరియైనది కాదనియు దానినిఁ జక్కదిద్దనిదే భరత దేశమునకు మేలు కలుగదనియు, నీ దేశీయుల నిమిత్తము తాను భుక్తిమానుకొనుటవలనఁ గొన్ని మంచిఫలితములు లభింపఁ గలవనియు విశ్వసించి గాంధిమహాత్ముఁడు కారాగృహమున నిరశనదీక్ష నవలంబించెను. ఈ విషయము విని రవీంద్రుఁడు పునహా పురమున గాంధిమహాత్ముని నిర్బంధావాసమునకు నెలవైన యెఱ్ఱవాడ చెఱసాలకేగి యమ్మానసీయుని యంతికమునం దుపవాసాంతము వఱకుండి పారణ మొనర్చినపిమ్మట స్వీయ రాష్ట్రముం జేరెను.

§ Communal award

రవీంద్రుని జీవితపుఁ జివరఘట్టమున నాతని ప్రాణ మిత్రులు పరమాప్తులు సన్నిహిత బంధుజనులు పలువురు మరణించిరి. ఒక్కర్తతప్ప యతని తోఁబుట్టువులందఱును బరలోకగతులైరి. జర్మనీ దేశమున విద్యాభ్యాస మొనర్చు చుండిన యిరువదేండ్ల కుమారుఁడు మృతినొందెను. రవీంద్రుని యాప్త స్నేహితులలో నొకఁడగు పియర్సన్ మహాశయుఁ డిటలీలో నొక రైలుబండిలోఁ బయనము చేయుచుండి, యాబండి తలక్రిందైన డబ్బాటు ఘటనలోఁ బ్రాణములు గోల్పోయెను. రవీంద్రుని యవ్యాజ వాత్సల్యమునకు భాజన మైయున్న దినేంద్రుడు కాలధర్మము నొందెను. ఈవిధముగాఁ దనప్రేమకుఁ బాత్రులైనవారిందఱు పరమపదించు టాతనికిఁ దీఱని కొఱఁత యయ్యెను. కాని యాతఁడు ధీరుఁడు; బ్రహ్మవేత్త; మృత్యుతత్త్వ మెఱిఁగినవాఁడు. జనన మరణముల రహస్య మెఱిఁగినవానికి భయ మెక్కడిది? జగజ్జీవేశ్వరుల సంబంధము తెలియఁగలిగిన విజ్ఞునికి వికారము లెక్కడివి?

1937 లో రవీంద్రుఁడు వ్యాధిగ్రస్తుఁడాయెను. అస్వస్థత యతిమాత్రమై యతఁ డిక జీవింపఁడని భయముగలిగించు విషమపరిస్థితి సంభవించెను. కాని కొన్నిదినములకు జాడ్యము తిరుగుమొగము పెట్టెను. అతని తనువున మెల్లగా స్వస్థత నెలకొనెను. తిన్నఁగా నతఁడు పాటునఁబడి 'విశ్వపరిచయ' మను గ్రంథము రచింపఁగలిగెను. విశ్వభౌతిక విజ్ఞానము నతఁ డీ పుస్తకమున నిక్షేపించినాఁడనవచ్చును. ఆగ్రంథ రచన పూర్తియైన పిమ్మట తన నాటకములకుఁ గావలసిన సంగీతమును నిర్దేశించుట, కొన్ని ప్రయోగ యోగ్యములైన

చిన్నరూపకములు సృజించుట- ఇట్టి వ్యాసంగములలోఁ గాలముగడపెను. ఇంతేకాదు, బంగాళీ భాషలోఁ దాను గని పెట్టిన కొన్ని విశేషములను గుఱించియు, నాభాషలోఁ దన కభిమతములైన రచనాపద్ధతులఁగూర్చియు నతఁడొక గ్రంథము వ్రాసెను. 'అభినవ వంగ భాషానిర్మాత' యని కీర్తిఁ గాంచిన యీశ్వరచంద్ర విద్యాసాగరుని శతవర్ష స్మృత్యుత్సవములలోఁ బాల్గొనుటకై యతఁడు 1939 లో మిడ్నపూరు నగరమున కరిగి యచ్చటి యుత్సవ కార్యక్రమము జరిపించిరాఁగలిగెను.

1939 సంవత్సరాంతమున రవీంద్రుని చిరకాల మిత్రుఁడు సి. యఫ్. ఆండ్రూస్ పండితుఁడు శాంతినికేతనమున నివసింపవచ్చెను. తన ప్రాణసఖుఁ డరుదెంచు టాతని కెంతో సంతసము గొల్పెను. కాని వచ్చినపిదపఁ గొన్ని మాసములకే ఆండ్రూస్ మహాశయుఁడు చికిత్సలకు లొంగని పెనుజాడ్యమునకు బలియయ్యెను.

1940 వేసవిలో రవీంద్రుఁడు తన చిన్ననాఁటి దినముల జీవితమును వర్ణించుచు నొక మంచి పుస్తకము రచించెను. ఆయేఁడే ఆగస్టునెల యేడవనాఁడు ఆక్స్ఫర్డు యూనివర్సిటీ వారాయనకు 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' పట్టమునిచ్చి గౌరవించిరి. ఈపట్టప్రదాన మహోత్సవము శాంతినికేతనమునందే ప్రవర్తిల్లెను. భారతదేశ ప్రధాన న్యాయమూర్తియైన సర్ మారిస్ గ్వాయరు మహాశయుఁడు శ్రీయుత సర్వేపల్లి రాధాకృష్ణ పండితుఁడు - వీరిరువు నేతన్మహోత్సవ కార్యధౌరంధర్యము వహించిరి. యూరపు

ఖండ పురాతన సారస్వతవల్లి కుపఘ్నమై యూడలువారిన లాటిను బాసలోఁ బట్టప్రదానోపన్యాస మీయఁబడఁగా రవీంద్రుఁడు పట్టప్రతిగ్రహ వాఙ్ముఖమును గీర్వాణవాణిలో వెలయించెను. భారతీయ సాహిత్య చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది గదా యీ మహోత్సవము! ఈ పండువుఁ జూడవచ్చినవారిలో జస్టిస్. హెండర్సన్, డాక్టర్ బాటంలీ, డాక్టరు శ్యామప్రసాదముఖర్జీ, డాక్టర్ కాళిదాస్ నాగ్ మున్నగు పుణ్యు లనేకు లుండిరి. వారం దఱు తా మాసమావేశము జూడఁ గల్గుటవలనఁ దమజీవితములకు ధన్యత చేకూర్చుకొన్నట్లు భావించిరి.

ఆవలఁ గొన్ని వారములకు రవీంద్రునకు రుగ్ణత ప్రాప్తించెను. చికిత్సకది కొంతలొంగినది కాని పూర్తిగా నివారితము కాలేదు. 1941 ఏప్రెలులో రవీంద్రుని కెనుబది వత్సరములు నిండెను. ఆ జన్మదినోత్సవమును భారతదేశ విద్యాప్రియు లాసేతు హిమాచల మనవద్య ప్రీతితో జరిపిరి. దినములు గడచుకొలఁది రవీంద్రుఁడు క్రమక్రమముగా దుర్బలుఁడు కాసాగెను. ఆయన కాయమును జ్వరము తెడతెఱపి లేక బాధింపఁజొచ్చెను. శాంతినికేతనము నుండి యాతఁడు కలకత్తా నగరమునకుఁ జికిత్సకై కొంపోఁబడెను. విఖ్యాతులు వైద్యులెన్నెన్నో చికిత్సలు కావించిరి. మంచి మందు లిచ్చిరి. ఫలముగలుగలేదు. 1941 ఆగస్టు ఏడవనాఁడు రవీంద్ర కవీంద్రుఁడు తాను జనించినచోటనే జోరసంకో భవనముననే భౌతికశరీరము పరిత్యజించి యర్చిర్మార్గ సరీసృఁడై పరమపదమునొందెను.

శ్రీ

# గురుదేవచరిత్రము

---

## దశమోల్లాసము

### I

### [రవీంద్రుని కవిత్వము]

రవీంద్రుఁడు విశ్వకవి. సుప్రసిద్ధులు * శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు నిర్వచించినట్లు

గీ: పలుకు నిలువరింపఁ బలుకున నలరింపఁ
బలుకు భావముననె వెలువరింపఁ
బలికి పలుకరింపఁ బలుకుచుఁ బులకింప
నీ రవీంద్రుఁ డొక్కఁడే యెఱుంగు.

రవీంద్రునిరచనములు ప్రాయికముగా మాతృభాషలోఁ గావింపఁ బడినవే. ఆయన కా భాషలోఁగల యధికార మగ్గలము. ఆతఁడు ప్రాఁత పలుకుబడులను మార్చినవాఁడు: నూత్నచ్ఛందస్సులు సృజించినవాఁడు: ఉదాత్తములైన యితివృత్తముల నవలంబించినవాఁడు: క్రొత్తపోకడల పోఁడిమితో దివ్యకావ్యములు దిద్దితీర్చినవాఁడు.

రవీంద్రుని కవితారీతి వైదర్భి. ఆయన కావ్యమార్గమున రస మధు లహరి ప్రవహించుచుండును. ఆతని కృతులలో రీతి రమ్యత లేని రచనమే కానరాదు. శబ్దసౌభాగ్య

---

* శ్రీయుతులు బాలాంత్రపు వేంకటరాయకవిగారు - ఓలేటి పార్వతీశకవిగారు. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల స్థాపించి యమూల్యమైన యాంధ్రభాషాసేవఁ గావించినవారు.

మతనిసొమ్ము: ఛందస్సౌందర్య మాతని యైశ్వర్యము. శయ్యాసౌకుమార్యము నాతఁడు పుణికి పుచ్చుకొన్నవాఁడు. మాలాకారుఁ డేపువ్వు నేపువ్వుతో జోడించికట్టిన బాగుం డునో యెఱిఁగి కట్టునట్లు రవీంద్రుఁడు పొత్తుపొసఁగిన పదముల హత్తించుటలో నేర్పరి. బృహద్గ్రంథకర్తలైన యిదానీంత నుల కృతులలో రవీంద్ర కవీంద్రుని రీతి రుచిరత యరు దుగాఁ గానవచ్చును.

రవీంద్రుని కవితలో నలంకార శోభ లేని తావులు తఱచుగా లేవు. ప్రకృతి వర్ణనముపై రవీంద్రునికి మిక్కిలి మక్కువ. సిద్ధహస్తుఁడైన చిత్రలేఖకునివలె రవీంద్రుఁడు చిత్రించిన ప్రకృతి దృశ్యము లెన్నో కలవు. ఒక ఘట్టమున శైల శిఖరముల నావరించిన మబ్బులను రవీంద్రుఁడు

"అమ్మఒొమ్మగుడుచు నడ్డబిడ్డల భంగి
నంబుదములు పర్వతాగ్రములకుఁ
దవిలియున్న వవిగో!..........."

అని చిత్రించినాఁడు. ఇట్టి భావచిత్రణములు రవీంద్రుని రచ నములం దెచ్చటఁ జూచినను బ్రత్యక్షమగును. రవీంద్రుఁడు ప్రకృతి మర్మముల గుర్తెఱింగిన తత్త్వవేత్త. మీఁదు మిక్కిలి యతఁడు తన హృదయమును దా వసించు లోకమున కతిసన్నిహితముగాఁ బ్రవర్తిల్లఁ జేయువాఁడు. ఆయన కారు ణ్యము సకల చరాచరముల యందును నిరంతరము ప్రస రించు చుండును. అది యతని యాధ్యాత్మికవిభూతి.

రవీంద్ర కవితా దేవతా హృదయమున శృంగారమున కన్న భిన్నమైన యితర రసములే మిన్నగాఁ బొడసూపినవి.

రవీంద్ర సృష్టిలో రసవద్ఘట్టములఁ గొన్నింటిని బరిశీలించి చూచినఁగాని దాని స్వరూపమిట్టిదని తేటపడదు.

1887 జగన్నాథక్షేత్రము (పూరీపురము)న కెనిమిది వందల యాత్రికులఁ గొనివచ్చుచున్న యొకనావ తుపానులోఁ జిక్కి తలక్రిందై సాగర గర్భమునఁ గలసిపోయినది. ఈ విషాద వృత్తాంతము నితివృత్తముగాఁ గొని రవీంద్రుఁ డొక లోకోత్తర కవితా పీయూష లహరిని సృజించి రసపిపాసువులకుఁ జూపినాఁడు చూడుఁడు. ఇదిగో, నా యీ యనువాద ప్రస్తుతి నుండియేని మీరించుక రుచిచూడవచ్చును.

ఉత్పలమాలిక

పారములేని సాగరముపై లయరాక్షసి తాండవించు నా
రౌర! మహాభయంకరమహస్సుగదే యిది యా తుటారికిన్!
సారెకు వేయిపక్షముల సంచలనమ్ములతోఁ బ్రభంజనుం
డారయ దిగ్విభాగములయందుఁ జరించెడి విక్రమించుచున్;
నీరధి నింగి యేకమయి నిట్టలమైన విపర్యయమ్మునన్
గూరి పరిభ్రమించు, నదిగో వసుధాసతికండ్లు మోసపుం
జేరికఁ జేరి మూసినది చీఁకటిరక్కస : చంచలా లతల్
దూఱులు వేలు లక్షలు తళుక్కనుచుఁ బెదరించె : ఫేనకై
వారకముల్ కఠోర విశదస్మితరూపముతోఁ బశుత్వ వి
స్ఫారకమౌ స్వభావమును జూపెను, పాపపు శక్తులన్నియుఁ
వేటఁడి వేడ్కతో నిధన వీథికి దూఁకెను గట్టుపాటులన్
దూరము నెట్టివైచి, యొకత్రోవయుఁ డొంకయు లేక, యెంకియుం
బేరిమిలేక ; భూమి దివినిం గవ గూడెడి తావులం దకూ
పారమునల్లఁ బాఱె, నది పాపురుమంచఘుచుఁ, దురాగ్రహాహా

దారముగా ధ్వనించు, భయమందుచు వెక్కుచు నేడ్చునవ్వ, వి
ఘూరముగాఁ గరుల్లును సుడుల్ మతిఁగోల్పడిచి[illegible] రేఁగఁగన్:
బేరెముతో నపాంపతి యభీకుఁ డభిగ్రహలీలతో నిజా
వారము పారముం దరియఁబర్వెను నుర్వులు నోటఁగ్రక్కుచున్;
బూరటిలన్ సహస్రఫణముల్ ముడుతల్విడఁదీసి యాడుచున్
వారక సర్పరాజయిన వాసుకి పంటవలంతి నట్టె క్రీ
డారతిఁ గందుకమ్ముగఁ దటాలునఁ గ్రిందికివైచి యార్చుచున్
వీరవిహారము స్సలుపు వేడబ ముట్టిపడెన్; నిశీథినీ
నారి తమిం గ్రమించి తన నల్లని నిద్రతెరన్ దెరల్చుచున్
గేరుచు దిగ్గణమ్ము వణకించు నుదగ్రపురూపుఁదాల్చెనా?
క్రూరపుఁ గాళరాత్రి యొకకోలు జలాకృతిఁ దా ధరించెనా?

గీతమాలిక

ఛందమే లేని లయ లేని సవురు లేని
యర్థమే లేని వికృత నాట్యంబు సలుపఁ
బ్రకృతి ప్రళయస్వరూపిణి బహుళకోప
రూపములుదాల్చి; జలము మారుతము మఱియు
మొఱుము ఉఱుములు నావిరి మీఱి మించి
గ్రుడ్డియాకృతు లేవో కొని యదేమొ,
స్వీయ సూత్నావతారాల జీవనాడు
లన్నిటిని లాగుకొనుచున్నయట్లు దోఁచె:
ఒక్క మార్గంబులే దొక్క దిక్కు లేదు,
నిర్నిరోధంబుగా నవి నిలుపు లేక
తమ్ముఁగని తామె వెఱపొంది తాఱుమాఱు
నొంది సుడిగుండములలోని కుఱుకుచుండె.

అంతె యెనిమిదివందలమంది జనులు
గలరు పురుషులు స్త్రీలు తెప్పలను మూయ
కట్టె చూచుచునున్నారు, గట్టిగాఁ గ
దించుకొనుచున్నవారు: 'తే తెమ్ము తెమ్ము
'ఓ యకూపార, బలియీయవోయి' యనుచు
నావ నువ్వెత్తుగాఁ బైకి లేవనెత్తి
యట్టహాసంబు లొనరించె నల తుపాను
పిశితభోజిని; డిండీర పిండమైన
యుప్పెన కొటారు కోటిబాహువుల నెత్తి
యఱచు నిమ్మని; నీలవర్ణాంగి కడలి
మృత్యుదేవత జాగుసైరింప కల్ల
పెల్లురోసమ్ము కతమునఁ దెల్లఁబాఱు;
భారము భరింపలేదు చిన్నారియోడ -
అది యథార్థ మయోమయ మదరి చెదరి
బ్రద్దలై పోవు దాని యురస్స్థలంబు;
మాయురే, యాటబొమ్మయిపోయె నావ,
అప్పు డేకీభవించిన యా ప్రచండ
మైన భౌతిక భూత సంహతికిఁ గర్ణ
ధారుఁ డా యోడ మొగదల దద్దరిల్లి
యున్నవాఁ డుడ్డుగుడిచి, యేమున్న దింక!

మ॥ 'పరమేశా భగవంతుఁడా కరుణమాపైఁజూపరా,
యీశ్వరే
శ్వర, రక్షింపవదేమిరా, యనుచు 'దేవా,సూర్యనారాయణా

శహరి, గోవింద, జనార్దనా, హరహరా', యంచుఁ
విలాపించుచుం
డిరి ప్రాణా లరచేతఁ బట్టుకొని యట్టి నావలో మానవుల్.

ఆ.వె॥ "అనుదినంబు వచ్చునట్టి సూర్యుండేఁడో?
దడిసి చంద్రుఁ డేడ దాఁగి నాఁడో?
చుక్క లేవొ? మాకు సుకము నందయునైన
పుడమియొడి యదెందుఁ బోయెనొక్కొ?

క॥ మాయింట్లేమయ్యెనొ? మఱి
మా యావజ్జవమంజిమము లేమయ్యెన్?
స్వామీ, యేటికి మాకీ
తామిస్రపు సవతితల్లి దయ్యపులీలల్?

గీ॥ ఎందుఁ జూచినఁగాని మే మెఱిఁగినట్టి
దెద్దియుం గానరాదు, మా దెదియు లేదు,
వెఱపుగొల్పెడి రూపము ల్వేనవేలు
దృష్టిగోచరమగు మా యదృష్టమేమొ!

గీ॥ దేవుఁడా, నీవు లేవు: దయావిభూతి
లేదు; ధర్మంబు న్యాయంబు లేదు లేదు,
సత్యమగు జీవితము లేదు – జగతిఁగలదు
మూదలించెడి ప్రకృతివినోదమొకఁడె."

క॥ ఈ పాపపు సంక్షోభము
పాప కనుంగొనెను – బెగడుపడి విలపించెఁ,
గూపెట్టె క్షణములోన వి
లాపధ్వని యొక్క తూరి లయమయిపోయెన్.

గీ॥ ముగిసె నంతయుఁ గనుతెప్పమూయులోన,
అసువు లెపుడుండెనో యెప్పు డవి వినిర్గ
మించెనో కాంచి రెవరు ? సమీరణుండు
ప్రబలుఁడై వీచి నూఱుదీపంబు లార్చె.

శా॥ ఆనందంబది వేయిమందిరములం దస్తంగమించెఁ గటా,
యేనాఁడేన్ బరబాధ లిట్టివని యూహింపంగ నేర్చున్నదే
మేనుందాలిచినట్టి వేఁదుఱుకు? భూమిం దాని కౌఁగాములస్
జ్ఞానంబున్నదె? తానెఱుంగునటె యున్మాదంబు స్వీయస్థితిన్?

చంపకమాలిక

మనసును దెచ్చి పిచ్చి నడుమం బడఁద్రోయఁగనేల? పేర్మి తి
య్యని కిరవైన మర్త్యహృదయమ్మున కీవ్యథయేల? యేమిమం
తనమిది! దేనికున్నదిటతల్లి? స్తనంధయుఁ డామె మోమదే
పనిగన టేలచూచునొకో? పైకొని యన్న భుజాంతరంబునం
దనుజుఁడు వ్రాలనేల? బిగియారఁ గవుంగిట హత్తనేల? వా
రెనయఁ బ్రభాతపద్మహిత హేమమరీచికలందుఁ జెల్మి పెం
పునఁ దమ చిన్ననాఁడెటులు మోదముతో విహరించిరోకదా
పనివడి కష్టసౌఖ్యములఁ బాల్గొనిరోకద! బాష్పబిందువుల్
వనరున వారి నేత్రకమలమ్ములలోఁ దొలఁకాడనేల ? యే
మనవలె నీ పరిస్థితి నయారె, మహోదయనీయమైన దీ
యనుభవ మోసి కక్కసపుహోవడి! యోయడియాస! గాలిగో
నునిచిన దీపపుఁ గళికయోయన సంచలనమ్ము నొందెడిన్
జెనఁకువమై భయంపడినప్రేమ; తుపానుతోడఁ వినోద కు
ర్దనముల కగ్గమైన యనదల్ నరమాత్రులు తాము ధాత్రిలో

మనఁగలరా? విలాసపు సుమాళముతోడ నుయాలలూఁగుటా?
జనుల సుఖేచ్ఛ నొక్క నిముసమ్మున మ్రింగద దేమిమి త్తి? యే
పున మన జీవితాశ మును ముట్ట గ్రసింపద దేమి? తల్లి నా
శన మగుచుండి బిడ్డను భృశమ్ముగ అొమ్మున గ్రుచ్చుకొంట కే
మ నెదవు? చావు దేవతకు స్వాగత మీఁజనుచుండి, పాలపా
పను విడిపింప నొల్లదు-ప్రపంచమునందది పెన్నిధాన మూ
వనితకు-ఆకతమ్మునసె పట్టినపట్టును వీడ, దాత్మ సం
హననము మీఁద నామె కిసుమంత స్వతంత్రత లేకపోయినన్;
వననిధియు న్నభమ్ము నొకవంక-నెలంతుక యొక్కవంక: నె
వ్వని తరమా వెలంది పసిపాపను గాచుట కీయవస్థలోన్?

గీతమాలిక

ఈ యబల కెట్లువచ్చెనో యింత బలము?
చూడుఁడేజాడ బిడ్డను వీడఁబోక
కొదురు పాటునఁ దన యెదఁ బదిలపఱచి
బయలు పరికించుచున్నదో, పశునిసర్గ
భరిత పాపప్రవాహానఁబడి మనుష్య
హృదయమున కిట్టిప్రేమ తా నెట్లువచ్చె?
ఎన్నఁడైనను నైరాశ్య మెఱుఁగనట్టి
తల్లిప్రేమ యిదేకదా, దానినణఁచు
హాని కలదని యొప్పుకొనట్టి దదియె.
అపుడపుడు జీవితామృత మాస్వదించి
నిత్య నూత్నత్వమార్జించి నివ్వటిల్లు
నట్టి దొక తల్లిప్రేమయే యగు ధరిత్రి.
యాఢిగాఁ ప్రేమ సత్య స్వరూపమిద్ది

యని గ్రహించిన వస్తువెందైన ధాత్రి
నున్న దనుకొంద, మద్దాని కొక్క నిమిష
మాయెఁబో, మాతృదేవతా స్వానుభూతి
యుల్లమం దుప్పతిల్లక యుండఁగలదె?

ఆ.వె॥ మృత్యువును జయించు ప్రేమ యీపెనుగాలి
వాన గుండెకాయలోని తల్లి
యబలహృదయకుటము నాశ్రయించెను - దీని
రేఁచినట్టి నిండుప్రేమ లేదె?

ఉ॥ అక్కట ఘాతుకత్వమదియక్కటికన్నిది, యొక్కచోటనే
నెక్కొని యున్న వొంటుకొని నెట్టన డీకొని నొట్టుకొంచు; స
మ్యక్కుశలాశయుఁ నిబిడమైన నిరాశయు నొక్కచక్కినే
యెక్కటిగూడుకట్టుకొని యీక్రియఁగాపురమున్న వారయః!

మ॥ పగలెల్లః మఱి రాత్రి యంతయును
దత్త్వంబుఃః గ్రహింపఃః మన
స్సెగఁబ్రాకుం దిగజాఱుఁ; జిక్కువడి యూ
హించున్ వికల్పించు, ధ
ర్మగతుల్ కర్మఫల ప్రసక్తులును మీ
మాంసించు ; "సత్యంబిదే
యగునా? యేది ఋతంబు? కల్లయెది?" యం
చాలోచనల్ సల్పెడున్.

ఆ.వె॥ అట్టి మనుజమాత్రు స్వాంతంబు మీఁద ఝం
ఝూ పిశాచశక్తి యేపుఁ జూపి
గట్టిదెబ్బ యొకటి కొట్టును-గాని పా
టింప దార్తి నరుని డెంద మార!

గీ॥ అప్పుడే ప్రేమ దేవత యవతరించి
చెంత కరుదెంచి, తనరెండు చేతులెత్తి
చేర్చుకొను బొమ్మునన్, భీతిఁ దీర్చి, యాద
రించి మధురోక్తులాడి లాలించు దాని.

శా॥కట్టుం దేవతయోర్తు—వేఱొక తెముక్కాల్ సేయు, నీరతిఁగ
న్పట్టు న్వీరి సనాతనం బయిన వ్యాపారం,బిదే యాటలో
నుట్టంకింతురు వేడుకన్—గెలుపులే దొక్కర్తుకున్—భంగపుం
బట్టైనట్టి యవస్థలే దిటులె యాస్వాదింతు రశ్రాంతమున్.

గాలివాన నీకవి వతంసుఁ డెట్లు వర్ణించినాఁడో చూచి తిరి గదా! అలలు రేఁగుట— ప్రభంజనుఁడు సముద్రము నుఱ్ఱూఁత లూఁపుట— కారుమొయిళ్లు గడబిడలు మెఱపులు మిఱుమిట్లు ఎంత యుద్వేగ జనకములుగా వర్ణితములై యున్నవో కంటిరిగదా! మబ్బులు మారుతములు ప్రాణములు గలవిగానో మారణ యంత్రములుగానో మన మెట్ట యెదుటఁ బ్రత్యక్షములౌట పరికించితిరిగదా!

ఝంఝామరుద్దేవత ప్రచండ స్వరూపముతో సముద్రునివైపు దృష్టి సారించి, భయదమైన తన నోరు తెఱచి నావలోని మానవుల ప్రాణముల బలియిమ్మని యడిగినది. తానును వారినే కబళింపనెంచి యట్లే యాఘోషించుచున్న సముద్రుఁడు జాగు సైరింపక రోసముతో వెల్లఁబాఱినాఁడఁట. కంటిరా రవీంద్రుని వర్ణనాశక్తి!

ఈ కావ్యఖండ మఖండమైన సజీవవర్ణనముతో నిండి యున్నది. ఇందు భయానకరసము వర్ణితము. దీనికి స్థాయి

భావము భయము. కాలుఁడు దీని కధిదైవతము. దేనివలన భయ ముత్పన్నమగునో యా మహావాతము – ఆ కల్లోలపరంపరలు – ఆ ప్రళయ వర్షము – అవన్నియు దీని కాలంబన విభావములు. నావలోని నిస్సహాయుల కంపము, వారు దిక్కులు చూచుట, వారి పరస్పరాలింగనములు – తమ్ముఁ డన్న భుజాంతరమున వ్రాలుట – తల్లి తన పసిబిడ్డను వక్షస్థ్సలమ్మున గదియించుకొనుట – ఇత్యాదు లనుభావములు వీరి యావేగము సంత్రాసము దీనత భ్రాంతి మృత్యువు సంచారి భావములు.

నిరపరాధులైన యెనిమిది వందలమంది ప్రయాణికులు తుపానులోఁ దగుల్కొనిన యోడతోఁగూడ నశించుట తటస్థించినది. వారందఱు మునిఁగి సాగర గర్భమునఁ గలసిపోయి శోచ్యులైనారు. వారు పునర్జీవితులగుట యెన్నఁటికిని జరుగునదికాదు.

మునిఁగిపోవు నావలోనున్న యొకపసిబిడ్డతల్లి యవస్థను బురస్కరించుకొని ప్రేమప్రభావమునుగూర్చి రవీంద్రుఁడు వెల్వరించిన భావములు పరమపవిత్రములు. ప్రభంజనుని దెబ్బకు నూఱు దీపము లొక్కసారి యారిపోయినట్లు యానపాత్రములోని వారందఱు జీవయాత్ర నొకేక్షణమునఁ జాలించి రన్నమాట మఱచి పోవుదమన్నను మఱపురానిదిగదా!

మూర్తీభవించిన కారుణ్యమనఁ దగినవాఁడు రవీంద్రుఁడు. ఎచ్చోటఁ బట్టిచూచినను ఆయన కవిత్వమున భగవంతుని సర్వభూతమయత్వ మంతో యింతో గోచరించుచునేయుండును. ఆ పరమేశ్వర తత్త్వమునే ప్రధానీకరించి

రవీంద్రుఁడు రచించిన 'నైవేద్యము' గీతాంజలిగా నాంగ్ల మునఁ బ్రకటితమైనది. 'నోబెలు' బహుమానమునకుఁ బాత్ర మైనది: ప్రపంచ విఖ్యాతికి నిదానమైనది. గీతాంజలి కవితా మంజులతనుగూర్చి చేయఁబడిన విమర్శలు సమీక్షలు ప్రశంసలు నానాభాషలలో నెన్నోయున్నవి.

గీతాంజలిలోని గీతికల నొకటి రెంటిని గాని యొత్తిన్మాధుర్య సౌందర్యముల ననుభవింపక సాగిపోవుట తగనిపని. ఇదిగో † యీగీతిక నరయుఁడు.

అంబరము నీవె, మఱి కులాయంబవీవె,
నైకవిధ వర్ణనాద గంధములచేత
ఆ కులాయంబులో జీవు నావరించు
ప్రేమయునుగూడ నగుదు వీవే మహాత్మ!
నవనవానంద దివ్యసౌందర్యరాశి!
పుడమి చెలికాళ్ళఁ గయిసేయఁ గుడికరమున
జాళువాతిట్టలో మనోజ్ఞప్రసూన
మాలఁ దెచ్చెడి నిశ్శబ్దలీల మేల్మి
యుల్లస మ్మూని యల్ల ప్రత్యూషలక్ష్మి.
పశ్చిమాశా ప్రశాంతి సంపత్పయోధి
నుండి చల్లని హాయి పీయూషరసము
కాంచన ఘటంబునిండ నింపించుకొని భు
జమ్మున వహించి మునిమాపుకొమ్మ వచ్చుఁ
బసుల నెడఁబాసి యొంటరిపాటుఁగన్న

† గీతాంజలి (ఆంగ్లానువాదము) లోని యఱువదియేడవ గీతమునకు నా పరివర్తనము.

పచ్చికబయళ్లమీఁదుగా నిచ్చలంపు
ననుపు దనరఁగ నడకచిహ్నములు లేని
బాటలనుబట్టి; కాని యెచ్చోట నెచట
హంస లంఘించిపోవుట కనధిరహిత
మైన గగనమ్ము వ్యాప్తమై యమరు, నచట
నిష్కలంక సితజ్యోతి నిండుకొలువు
దీరి పరిపాలనముఁజేయు – దినములేదు,
లేదు రాత్రియు, రూపంబులేదు, కనఁగ
వర్ణమును లేదు, లేదు శబ్దంబు వినఁగ.

సౌందర్యకందమైన పూలదండనుంచిన బంగారుతట్ట కుడిచేతఁ బట్టుకొని ప్రభాతలక్ష్మి చప్పుడుచేయక వచ్చుచున్నదఁట! దేనికి? అందచందముల హారముతో వసుంధరాసుందరి యుత్తమాంగమును సింగారించుటకు. ఉదయాదిత్యుని బింబము నిజముగా బంగారు తట్టలోఁ జెండుగాఁ బెట్టిన పూలదండగా నుండును. అది ప్రభాతలక్ష్మి కొనివచ్చినదే కదా!' అప్పుడే పొడుచుచున్న రవిబింబమునుండి వెడలు పైఁడివన్నెల తీగల గుంపులు భూమ్యుపరిభాగమునఁ బ్రసరించుట స్వాభావికమైన సంఘటనము. దానిని రవీంద్రుఁడేమని వర్ణించినాఁడు? ప్రత్యూషరమావధూటి చేతిలోని పుష్పహారము పుడమి పైదలి యూదలఁ గయిసేయుటకై తేఁబడినదని యన్నాఁడు. అవును. అందుకు గాక మఱెందులకు? భారతీయ ప్రకృతి రామణీయక మీగీతికలోఁ గేంద్రీకృతమై యున్నది. ఉపనిషత్కాలములనాఁటి కులపతులు శిష్యశతముల ప్రోలు వెదచల్లు బ్రహ్మతత్త్వ పరిమళము లుషస్సౌభాగ్యములలో

మేళవించి యీగీతికనుండి గుబాళించుచున్నవి. స్వామీ! రవీంద్రకవిబ్రహ్మ, నీవు సృజించి మాయెదుట నిల్పిన ప్రభాత సుందరి కింత సౌందర్య మున్నదని యామెకును దెలియ దేమో!

పరమేశ్వరుని విభూతి గీతాంజలిలోఁ బ్రత్యక్షరము నను బ్రతిఫలించుచుండును: ఆర్తుఁడైన భక్తుని బహువిధ ప్రార్థనా ప్రణాళికలను రవీంద్రుఁ డాత్మకవితా గంగా స్రవంతిలోఁ బ్రవహింపఁ జేసినాఁడు. ఇదిగో, ఈఘట్టమున దిగి పుడిసెడు గ్రోలి సాగిపోవుదము. దీనుఁడైన భక్తుఁడు భగవంతుని బ్రార్థించుచున్నాఁడు. ఎట్లు? ఇట్లు: 'అయ్యా నాహృదయ మెండఁబాఱి పోయినది. నామనుగడలోని మనోజ్ఞత మాసిపోయినది. చిక్కుపనుల త్రొక్కటలోఁ బడి క్రుంగి పోవుచున్నాను. ఈ నాబిచ్చపుగుండె మూల ముచ్చముడిఁగి వాకిలి మూసికొని కూర్చుండియున్నది. దానికి దుమ్ము క్రమ్ముకొని యున్నది. దానిని నిండార మాయ యావరించినది. ఇట్టి పరిస్థితిలో, ఏచేటు నాకు వాటిల్లినను నన్నుఁదిన్నగాఁ బాటునఁబడఁద్రోయు భారము నీదే! చరాచరములతోఁ గూడిన యనంతకోటి బ్రహ్మండములకును నీవు సార్వభౌముఁడవు. రాజలాంఛనములైన విద్యుద్దీపికలతో గర్జాపటహ ఢక్కాఢమామికాధ్వనులతో దయచేసి నాపయి దయ వర్షింపుము. రమ్ము. నాద వినోదము వెలయింపుము. శాంతి ననుగ్రహింపుము. నాలోపలఁ బ్రవేశింపుము.' – ఇది ప్రార్థనము. ఈక్రింది సీసపద్యము నాయనువాదమాత్రమే యైనను రసికజనానుభావ్యము కాకమానదని యుదాహరించుచున్నాను.

సీ॥ శుష్కించి నా మనస్సు కఠోరమై యుండ,
దయను వర్షింప నా పయికి రమ్ము,
నా జీవితంపు టందము మందమై యుండ,
గానమ్ముతోడ నాకడకు రమ్ము,
అలజడిపనులు నన్నావరించిన యట్టి
తఱి శాంతితోడ నాదరికి రమ్ము.
నా తిరిపంపు డెందము మూలఁబడి యుండ,
తలుపు భేదించి లోపలికి రమ్ము,

తే॥గీ॥ మాయచే ధూళిచే నాదుమానసమ్ము
కప్పఁబడి గ్రుడ్డిదై యున్నయప్పు డీవు
స్వామి, రావయ్య రాజలాంఛనము లూని
తావకీన తటి ద్గర్జితములతోడ.

---

శ్రీ

# గురుదేవచరిత్రము

దశమోల్లాసము

## II

### రవీంద్రుని రూపక రచన

ఒకటి రెండుతప్ప, రవీంద్రుని ప్రాథమిక రూపకములన్నియుఁ గేవల కవితాయతన మాత్రములని చెప్పవచ్చును. ఈ రచనములలో రూపకములుగాఁ బేర్కొనఁదగినవి 'చిత్రాంగద' 'మాలిని' 'కచ-దేవయాని' యను నాటికలు.

'చిత్రాంగద' యే యాంగ్లపరివర్తనము నొంది 'చిత్ర' యైనది. ఇది రవీంద్రుని రూపకములలో నతిరమణీయమైనది. లోపములేని వస్త్వైక్యముతో నకలంకమైన యర్థసౌభాగ్యముతో నైంద్రజాలికశక్తి సంపన్నమైన శబ్దసౌందర్యముతో ఈ రూపకము దీపించుచుండుట సర్వథా సత్యము. భావనాతీవ్రతగల రవీంద్రుని కవితావేశ మీ నాటికయం దాపాదచూడ ముట్టిపడుచుండును.

చిత్రాంగద మణిపురప్రభువైన చిత్రవాహనుని యేకైక పుత్రిక. చిత్రవాహనుని తాతముత్తాతలలోఁ బ్రభంజనుఁడను ప్రభువరేణ్యుఁడు చిరకాలము సంతానరహితుఁడుగానుండి, కులము నిలుపుకొను నిమిత్తము పరమశివుని

గూర్చి కఠోరతప మాచరించెను. ఈశ్వరుఁడు మెచ్చి ప్రత్యక్షమై యతని వంశము వర్ధిల్లఁ జేయఁగల కొడుకు పుట్టు ననియు, అట్లే యవిచ్ఛిన్నముగా నతని యన్వయము వెంపొందుననియు వరమిచ్చిపోయెను. శివుఁడు చెప్పినచొప్పునఁ బ్రభంజనుని వంశమున సుతులే జనియించుచుండిరి. అది యేమికతముననో చిత్రవాహనునికి మాత్రము పుత్రిక పుట్టు వందెను. అతఁడామె నత్యంత వాత్సల్యముతోఁ జూచుటయే కాక, యక్కుమారిని తనయునిగాఁ బాటించి యామెకు వీర పురుషోచితములైన విద్యలు నేర్పించి, రాజనీతి నభ్యసింపఁ జేసి, ప్రజాపరిపాలన మొనర్చుటకుఁ గావలసిన సమర్థత చేకూర్చెను. అర్జునుఁడు తీర్థయాత్రల నిమిత్తము పర్యటన మొనర్చుచు మణిపురమున కరిగి, చిత్రాంగదనుగని, యామెలావణ్యమునకు ముగ్ధుఁడై, యేతన్నారీమణి ప్రణయ సూత్రములచే బంధితుఁడై, యా కన్నియకరగ్రహణము కావింపవలసిన సంఘటనమునఁ జిక్కువడెను. అట్టితఱిఁ జిత్ర వాహనుఁడు "ఓ కురుకులాలంకారా, యీమె గర్భమున జనించు బిడ్డ నా వంశమున కంకురమై తప్పనిసరిగా నా సింహాసన మధిష్ఠింపవలయు. అందుకు నీ వంగీకరింతువేని నా యీ యాత్మజను నీకిచ్చి పెండ్లి చేయుదును. దీనికి నీ వొడఁబడుదువుగదా!" యని పార్థు నొప్పించి పుత్రిక నతని కొసఁగి పరిణయము కావించెను. అర్జునుఁడు చిత్రాంగదతో మూఁడు సంవత్సరము లత్తవారింటఁ గడపెను. చిత్రాంగద మగబిడ్డను గనియెను. ఆవల భార్య యంగీకృతి నంది యత్తమామల సెలవుగొని, పుత్త్రగాత్ర పరిష్వంగసుఖము గని, మణి

పురము వీడ్కొని బయలుదేరి తీర్థయాత్రలు ముగించుకొని యర్జునుఁ డన్నదమ్ములున్న నెలవు చేరెను. ఇది భారత గాథ. ఈ వృత్తము నాధారము చేసికొని రవీంద్రుఁడొక మధుర దృశ్యము సృజించినాఁడు.

తండ్రి యాదేశమున నిరంతరము పురుషవేషముననే చిత్రాంగద వ్యవహరించు చుండెడిది. ధనుర్విద్యలోఁ గృత హస్తయైన కతమున భయంకరారణ్యముల సంచరించి వన సత్త్వముల వేటాడు నభ్యాసముగలిగి వర్తించెడిది. ఇన్ని విద్యలయందు ద్రీర్ణత సాధించినను నిసర్గము కారణముగా 'నేను నెలంతనుగదా!' యని చిత్రాంగద చివరకు గుఱు తింపవలసిన దయ్యెను. ఈ నాటికలోని పాత్రములు నాలుగు మాత్రమే. దేవగణమునకుఁ జేరిన మదన వసంతులు తమ దేవత్వము నించుక కట్టిపెట్టి మానవమాత్రులైన చిత్రాంగ గదార్జునుల ప్రణయవ్యవహారముతో జోక్యము కల్పించు కొందురు. వీరి ప్రస్తావము వచ్చినప్పుడు షేక్స్పియరు మహా కవి రచించిన ''టెంపెస్టు' నాటకములోని 'ఏరియల్' 'ఐరిస్' 'సెరిస్' మున్నగు భూమికలు మన స్మృతి పథము నకు వచ్చును. చిత్రాంగదనుగూర్చి చదువునప్పుడు 'మి రాండా' రూపము మన చిత్తవీధికి రాకమానదు.

చిత్రాంగదకు మదన వసంతులతో నొదవిన సమా వేశముతో నాటిక యారంభమగుచున్నది. భగవానుఁడు మన్మథుఁడు మధుసమేతుఁడయి యవతరించి యమాయిక యగు చిత్రాంగదతో నిష్కపటమైన నిష్కలంక సంభాష ణముచేయును. అవ్యాజ ప్రణయ పరిపూరితములైన వారి

మాటలు ముచ్చటగొల్పును. అట్లయ్యు వారి గంభీరతకు లోపములేదు. 'విధాత హృదయమున మొదట జనించిన వాఁడను నేను. - స్త్రీ పురుషుల జీవితములను సుఖ దుఃఖ బంధములతో ముడివెట్టువాఁడను.' అని చిత్రాంగదకు మన్మథుఁడు తన్నుఁదా నెఱుకపఱచుకొనుచున్నాఁడు. ఇఁక వసంతుఁడో 'నే నీయన నెచ్చెలిని. ఋతురాజును జమీ. జరామరణములు జగము నెముకలంట పీడించునుగాని నేను మాత్ర మనవరతము వాని వెన్నంటి తఱుముకొనిపోయి పోరుచుందును. మూర్తీభవించిన నిత్యయౌవనమును నేను.' అని తన కలరూపు దెలుపును. పట్టరాని యుద్రేకోత్సాహములతోఁ జిత్రాంగద 'అయ్యా, వసంత భగవంతుఁడా, నీకుమ్రొక్కెదను' అని యాతని యనుగ్రహము సంపాదించుకొనుటకు ముందడుగువైచును. చిట్టచివర కామె ప్రార్థన మిది — 'ఒక్కదినమేని నాకు లావణ్యపూర్ణత మీరనుగ్రహింతురేని అది చాలును. ఆవలి బేరముల భారము నాది.' అని. 'ఒక్కదినమేమి? ఒక్కసంవత్సరమంతయు వసంత ప్రసూన శోభాలాభము నీయంగవల్లిలో నుల్లసిల్లునుగాక!' అని వసంతుఁడు చిత్రాంగదపాలిటి కిచ్చ కెచ్చిన కోరికలిచ్చు మెచ్చుల చెట్టయినాఁడు.

ఈ నాటికాపేటికలోని మురిపెంపు రతనాలబరణి యనఁదగినది మూఁడవరంగము. తనకై ప్రియుఁడు ప్రణయభరమునఁ బరితపించుచున్నాఁడని చిత్రాంగద యిట్లనుచున్నది:

సాధ్యముకాదు— ఆఁకలిగొన్న యంతరాత్మని యప్పళింపు బాహువులవలె నిన్నాకర్షించు అభావోద్రేకపు దృష్టి నెదుర్కొనుటకు నీకు సాధ్యముకాదు. బంధములు తెగ తెంపుచేసికొని వెలికిరమ్మని హెచ్చరించెడి ఆవేగపూరితమైన పిలుపుతో నుక్కిరి బిక్కిరి యగుచున్న తదీయ హృదయమును గుఱుతించికూడ, బిచ్చగానివలె వచ్చినదారినే యాతని బొమ్మనుటయా? కాదు, నీకు సాధ్యముకాదు.'

[మదన వసంతుల ప్రవేశము.]

స్వామీ, కామదేవా, నన్నెట్టి దారుణతాపమునఁ బొదివినాఁడవయ్యా!

కాల్చుచున్నాను, నేనేది స్పృశించినను అది దగ్ధమై పోవుచున్నది.

మదనుఁడు:—నిన్నటిరాత్రి యేమిజరిగినదో యది వినఁగోరుచున్నాను.

చిత్రాంగద:—సూర్యాస్తమయవేళ వసంతపుష్పదళములు పఱచిన పచ్చికపడకపై విశ్రమించితిని. నేను దినమంతయుఁ గూడఁబెట్టిన మకరందము నొక్కొక్క బిందువుగా మెల్లమెల్లగా నాస్వాదించి యనుభవించుచు, అర్జునుఁడు నా సౌందర్యమునుగూర్చి చేసిన యద్భుత స్తుతిని నా స్మృతికిఁ దెచ్చుకొంటిని. నేఁ గడపుచుండిన జీవితము నా గతభవచరితముల కరణి విస్మృత మయ్యెను. నేనొక పూవునుగా భావించితిని. పూవున్నది, అదీ వనదేవతల

ముఖస్తోత్రముల ఝుంకారము లాలకింపఁ గలదు. వారి రహస్యముల గుసగుసలు వినఁ గలదు. కాని యా వినుకలి భాగ్య మనుభ వింపఁగలుగుట కొన్ని గడియలుమాత్రమే. ఆ యవకాశము ముగియఁగా, మిన్నులరయు తన కన్నులు వ్రాల్చి తలవంచి వాయోడి నిట్టూర్చి నేలఁ గలియుచున్నది. భూతభవిష్య ద్విహీన మైన నిర్దోషమైన తన యీ నిమేషపు సూక్ష్మ గాథ నీ విధముగాఁ దుద ముట్టించుచున్నది. నేనట్టి పూవునుగా భావించితిని'.

చిత్రాంగద చెప్పిన యీ ప్రత్యుత్తర మెంత రసవంత ముగానున్నది! ఈమాటలు విని

వసంతుఁడు:—అనంత శోభా పూర్ణమగు జీవిత మొక్క ప్రభాతమున నమసి పోఁగలదు.

మదనుఁడు :—అపరిమితమైనయర్థము ఒక చిన్నారిపాటలో నిమిడిపోయినట్లు -

అని పలికినాఁడు.

తన నవ్యలావణ్యము తిరోహితమైన దని చింతించి, మునుపటివలె మృగయావినోదములఁ బ్రొద్దుపుచ్చుట కను వైన గట్టిచేతులరూపు తనకుఁ దిరిగి వచ్చినదని చిత్రాంగద యంగలార్పఁగా

మదనుఁడు :—మర్త్యమాత్రుని పుత్రికవైన యో చిత్రాంగదా, దివ్యభాండాగారమునుండి సురభిళ స్వర్గ మధువును బ్రుచ్చిలించి, దానితో నిహ

లోక నిశాకలశము నిండించి, యీ మధుకల
శము నీ చేతిలోఁ బెట్టితిని. — ఈ యోజ
నిన్ను బహూకరించినను నీ యీ నిర్వేద
వాక్కులు వినుచున్నానుగదా!

అని నుడివినాఁడు 'నిజమే,' యన్నది చిత్రాంగద. విజయుని ప్రేమగడించిన యీ దేహమే యిప్పు డాపె ద్వేషమునకుఁ బాత్రమైనది. ప్రేయసుని పరీరంభపంజరమున వేయుట కనువుగా దాని కనుదినమును సింగారముచేయవలసివచ్చెనుగదా యని వేసరుచున్నది—

'ఈ యెరవు తెచ్చుకొన్న శృంగారము - నన్నావరించిన యీ యసత్యము - విరియఁబూచిన పూరేకులవలె రాలిపోవుట కనుచున్నానుగదా. తన దినములు పేదటికమున శవమానపడు తరుణి కరణి, రాత్రిందివము విలపించుచుఁ గూర్చుండుదశ రానున్నది.'

అని యాక్రోశించుచున్నది. తనలావణ్యమే సుమనోమయ వసంతభువనమునుండివచ్చెనో యది యచ్చటికేపోయి చేరు సమయ మాసన్నమైనదని వెఱపందుచున్నది.

''కట్టకడపటిగంటలో నా సౌందర్య మారిపోవుదీపమువలెఁ దుదివెలుఁగు వెలిఁగిపోవనిమ్ము.''

అని యాపె వేఁడుకొనుచున్నది. 'వల్లె' యనిపించుకొన్నది: కాని యీ వర మాపె కుపకరింపలేదు. తమయాపదలు వాపి తమ్ముఁ గాపాడుచుండిన యే రాచబిడ్డను సామాన్య ప్రజలందఱు కొనియాడుచుండిరో, యా చిత్రాంగదకై యర్జునుఁడు కలవరించినాఁడు. చిత్రాంగద 'నీ నాయిక లావణ్య

రహిత ' యని యర్జునునికి బయల్పఱచినది.

'కాంతి యంతయు నీలమేఘములు పీల్చివేయఁగాఁ,
పాషాణ పర్వతాగ్రమునఁ గూర్చుండి ధూతోల్లాసయై
తోచు ప్రభాత రేఖ వంటిది నీ ప్రేయసి '

అని చిత్రాంగద వల్లభునికి దీనముగాఁ దెలియఁ బలికినది. 'రాజకుమారినైన చిత్రాంగదను మాత్రమే నేఁడు నీయధీన మొనరింపఁ గలుగుచున్నాను.' అని నిష్కపటముగా స్వ స్వరూపము నాపె వెల్వరింపఁగా 'ప్రాణప్రియా, నా జీవిత మున కిప్పుడు పరిపూర్ణత్వ మబ్బినది' యని యర్జునుఁడు సంతృప్తుఁ డగుటతో నాటిక సమాప్త మగుచున్నది.

ఇంకొక్క రేవున మహాభారత కథా మందాకినిలోనే దిగి రవీంద్రుఁడు జాతరూప రూపక సహస్ర పత్రమొకటి కోసికొనివచ్చి రసిక ప్రపంచమున కర్పించినాఁడు. ఆయన చేయితగిలి యది యెన్నఁటికిని వాడిపోవనిదై నది. దాని పరి మళములు దిగంతముల దనుక వ్యాపించునవై నవి. దాని సువర్ణకాంతులు సూర్యాలోకములతో నెకసక్కెము లాడున వై నవి. ఇదియే కుంతీకర్ణుల సమావేశము.

కరుణరస మీనాటికలోఁ బ్రస్ఫుటాకృతిం దాల్చినది. గంగా తీరమున సంధ్యాదేవి నారాధించు కర్ణుని కడ కరుదెంచి కుంతి

'* వత్సా, నీ జీవిత ప్రథమప్రభాతమును విశ్వముతో పరి
చయము కావించిన దాననునేనే.'

---

* సుగృహీత నామధేయులు విశ్వభారతీ సారస్వత పట్టభద్రులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి యాంధ్రానువాదమునుండి యీ నాటిక లోని ఖండములుద్ధరించితిని.

అని తన్నుఁదా నెఱుక పఱచుకొను చున్నది. ఈమె తన నైరి యైన పార్థునికే కాక తనకును దల్లియని కర్ణుఁడు తెలిసి కొనును. కటికివారి గుండెలనుగూడఁ గదలించున దీ ఘట్టము. కర్ణుని హృదయముసైత మొక్క కనురెప్పపాటు డోలాయమానమైనది. ఏలకాదు ?

'నా తల్లి ప్రేమపూరిత స్వరమును నేఁటిరాత్రి అజ్ఞన జననీ కంఠమున ఏలవింటిని ? నా పేరు ఆమె ముఖమున ఏల ఇట్టి మధుర సంగీతమునకు పాత్రమగుచున్నది ? తటాలున నా చిత్తిమేల పంచపాండవులవైపు సోదరప్రేమతో పర్విడుచున్నది ?'

అని కర్ణుఁడు క్షణకాలము వితర్కించుకొనెనుగాని వెంటనే యా సందిగ్ధ హృదయమును దిటవు పఱచుకొని యామెతో

'నన్నేల విడనాడితివో చెప్పకపోయిన పోయెదవుగాక, ఈ ప్రపంచమున భగవద్దత్తమగు ప్రథమదానమగు మాతృప్రేమమును నీకుమారునికి దక్కనీయక నీవేల హరించితివో అదియును చెప్పక పోయెదవుగాక.

కాని నేఁడు నీ యంకమునకు తిరిగి నన్నేల తీసికొనఁ గోరుచున్నావో అది మాత్రము తెలుపుము.

అని ప్రశ్నించినాఁడు. తనయుని క్షమాభిక్ష తల్లి వేఁడుకొన్నది. అమ్మయడిగిన క్షమాపణ కుమారుఁ డరమరలేని మనసుతో నిచ్చినాఁడు. తన యనుజుల యొద్దకుఁ దనవెంట రమ్మని కుంతి కుమారుని వేఁడినది.

'వత్సా, యుధిష్ఠిరుఁడు ధవళవ్యజనము వీవఁగలఁడు. భీముఁడు ఛత్రము పట్టును. వీరధనంజయుఁడు నీ సారథి

కాఁగలఁడు. ధౌమ్యుఁడు వేదమంత్రములు గానముచేయును.
శత్రుజేతవై నీవు అఖండప్రతాపమున ఎదురులేని రాజ్యమున రత్నసింహాసన మధిరోహింపుము.'

అని కుంతి కర్ణుని బ్రలోభించును. కర్ణుఁ డప్పట్టున

'సింహాసనమా, మాతృప్రేమగూడ వలదన్నవానికి రాజ్యలోభము చూపుచున్నావు, తల్లీ, ఒకనాఁడు ఏసంపదనుండి వంచించితివో ఆ సంపదను తిరిగి యిచ్చుట నీకసాధ్యము. మాతా, నా జననినుండి, నా సోదరులనుండి, నా రాచకులము నుండి ఒక్క ముహూర్తమున నన్ను నా జన్మక్షణముననే నిర్మూల మొనర్చితివే. *సూతమాతను మోసగించి, రాజమాతను తల్లియని, కురుపతితో కట్టుకొన్న బంధములను ఛిన్నమొనర్చి నేఁడు రాజసింహాసనమువైపు నేను పరుగు లిడిన – ఛీ ఛీ, యదెట్టి నైచ్యము!'

అని ప్రతిఘటించి పలికినాఁడు. తొల్తఁ దన చేతులతోఁ దా నొనర్చిన యపకార మనుభవించిన తనయుఁడే యీనాఁడు తన సంతతిని మమతలేని హస్తములతో వధింపవచ్చునని యెఱుఁగని కుంతి యత్యంత సంతాపముపాలై హతవిధి విలసనముం దలంచుకొని నిట్టూర్చును. కర్ణుఁ డయ్యెడ

'తల్లీ, భయమువలదు. పాండవులకే విజయము చేకూరఁగలదని వక్కాణించుచున్నాను. నేఁటి రజనీ తిమిర ఫలకమున నక్షత్రముల వెలుఁగున భావి ఘోరయుద్ధఫలమును ప్రత్యక్షముగా పఠింపఁగల్గుచున్నాను.'

అని తల్లి నూరార్చును.

---

* 'మాత-రాధను' అనుట బాగుండు నేమో!

కర్ణుఁడు క్షమాగుణసంపన్నుఁడు. దానవీరుఁడేకాదు, దయావీరుఁడును. ఆతని హృదయదార్ఢ్యమును మన మింకొక్కని యందుఁ గనఁగలమా? అతని కతఁడే సాటి. నిశ్చయించుకొన్నాఁడు: తల్లికి విన్నవించినాఁడు.—

"జన్మదినమున పేరుపెట్టక ఇల్లుచేర్చక నీటిపై నెట్టి పోయితివి. అదేరీతి నేఁడును, కాంతివాడిన కీర్తి తఱిగిన పరాభవ ప్రవాహమున మమతలేని చిత్తముతో నన్నువిడిచి పొమ్ము. — — — జయలోభమున యశోలోభమున రాజ్యలోభమున వీరులసద్గతినుండి భ్రష్టుఁడనుకాకుండునటుల మాత్రము నన్నాశీర్వదించిపొమ్ము తల్లీ"

అని సంప్రార్థన మొనర్చినాఁడు. ఇట్టివాఁడు కర్ణుఁడు. రవీంద్రుఁడు సృజించిన కుంతీకర్ణుల సమావేశ దృశ్య మిట్టిది.

'చిత్రాంగద' 'కచ–దేవయాని' 'మాలిని' యనునవి రవీంద్రునిరూపకములలో నుదాత్తములయినవి. మొత్తముమీఁద రవీంద్రునిరూపకములు దృశ్యప్రబంధములుగాఁ బ్రథమశ్రేణికిఁ జెందినవని చెప్పుటకు వీలులేదు. వానియందు సంవిధాన చమత్కృతి కథాకల్పనము మృగ్యములు. ఏవో కొన్నికొన్ని దృశ్యములలో ఛాయలో గోచరించును. కాని, భిన్నప్రవృత్తుల పరస్పర సంఘర్షణములు ఉద్రేకపూరిత సంఘట్టనములు విషాద సమావేశములు ప్రయోగ యోగ్యములుగా రవీంద్రుఁ డెన్నో ముద్దుగా దిద్ది తీర్చియున్నాఁడు. ఆతని రూపకములు మానవజీవితమున కతి సన్నిహితములైనవి.

---

శ్రీ

# గురుదేవ చరిత్రము

దశమోల్లాసము

## III

[రవీంద్రుని కథాసృష్టి.]

రవీంద్రుఁడు కథకుఁడుగా గద్యకావ్య నిర్మాతగాఁ గూడ లబ్ధ ప్రతిష్ఠుఁడు. కవులకు గద్యము సానరాయి: అనఁగాఁ బరీక్షాస్థానము. రవీంద్రుఁడు కేవల ప్రతిభా బలమున రసవంతములైన పర్యాయబంధములను సృజించినాఁడు. అవి ప్రాయికముగాఁ గల్పిత వృత్తాంతములుగల చిన్నకథలు.

'కాబూలీవాలా' 'ఎండ–నీడ' 'హైమంతి' 'భాయిఫోటా' మొదలగు రవీంద్రుని కథానిక లనేకము లున్నవి. మానవుల వివిధ చిత్తవృత్తులను రవీంద్రుఁ డీ కథానికల యందు నిపుణముగాఁ జిత్రించి యున్నాఁడు. ఆతఁడు మనుష్యహృదయ రహస్యములు కనుఁగొని యథాతథముగా వెల్వరింపఁగల్గిన సిద్ధహస్తుఁడు. ఆయన జీవచ్చిత్రములు సృజింపఁగలిగిన కవిబ్రహ్మ. ఆలు మగలకు అక్కచెల్లెండ్రకు అన్నదమ్ములకుఁ గల సంబంధములు రవీంద్రుఁ డత్యంతసుకుమారముగాఁ గథలలో నావిష్కరింపఁగలఁడు. ప్రాణమిత్రుల స్నేహగాథలు, కపటనాటకము లాడు మిత్రబ్రువుల నటనలు,

ఉదాత్తహృదయుల కష్టసుఖానుభవములు రవీంద్రుఁడు కన్నులఁ గట్టినట్లు వర్ణింపఁగల జెట్టి. ఆయన రచించిన కథలలో సాధువుల సౌమనస్యములు ధూర్తుల దుర్వర్తనములు చదువరుల కట్టెదుట యథార్థ జీవితము సంధువలెఁ బొడసూపుచుండును.

మచ్చున కొకటిరెండు రవీంద్రుని చిన్నకథల తత్త్వమును బరిశీలింతుమేని మన మామహామహుని రచనా వైదగ్ధ్యము గ్రహింపఁగల్గుదుము. 'కాబూలీవాలా' కథ నొకతూరి జ్ఞప్తికిఁ దెచ్చుకొందము — సంపన్నుఁడైన యొక గృహస్థుఁడు: ఆతని కొక్కకూఁతురు. ఆమె కైదేండ్ల వయస్సు - దానిపేరు 'మిని.' అది మిక్కిలి వావదూక అగు పిల్ల. ఒకనాఁ డీ 'మిని' యింటి ప్రక్కదారినిబడి యొక కాబూలీవాఁడు నడచిపోవుచుండెను. 'మిని' గవాక్షము నుండి చూచి 'కాబూలీవాలా'! యని కేకవైచి పిల్చినది. ఆ కేకవిని కాబూలీవాఁడు చప్పున 'మిని' చెంతకు నవ్వు మొగముతో వచ్చినాఁడు. 'మిని' తండ్రి తనకూఁతు పిలుపు కతమున వచ్చినవాని నూరకపంపుట మర్యాదకాదని యేవో యతని యొద్దకొని విలువయిచ్చినాఁడు. గదిలో 'మిని' కానఁబడనందున 'ఆ బిడ్డ యింటిలోని కరిగినది కాఁబోలు' నని రెండు మూఁడు నిముసము లుండి, తండ్రి పిలువఁగా వచ్చిన పిల్ల చేతిలోఁ దన సంచిలోనుండి తీసి పండ్లు పప్పులు పెట్టఁబోయినాఁడు. 'మిని' సంకోచించి తీసికొనక తండ్రిని గాఁగిలించుకొన్నది. కొన్నినాళ్లు జరుగఁగా 'మిని' కిని కాబూలీ వానికిని బరిచయము హెచ్చినది. ఆ తఁడు వచ్చి

నవ్వుచు 'మిని' కి వినోదపుమాటలు చెప్పుచు, బాదము పప్పులు పండ్లు మున్నగునవి యిచ్చు టలవాటయ్యెను. కొంత కాల మిట్లు జరుగునప్పటి కించుమించు ప్రతిదినము కాబూలు వాఁడు 'మిని' యొద్దకువచ్చి యామెతోఁ బదినిముసములు గడపుట పరిపాటి యయ్యెను.

కాబూలువాఁడు 'మిని'తోఁ జేయు హాస్యప్రసంగములు 'మిని' వానితో నాడుమాటలు చూచువారికి మిక్కిలి మక్కువ గొల్పుచుండును: కాని 'మిని' తల్లికి మాత్ర మీ కాబూలువాఁడు తమయింటికిఁ దఱచుగావచ్చు టిష్టములేదు. ఆమెది పిఱికి స్వభావము. వీథిలో నే పెద్దశబ్దమైనను ఆమె భయపడు చుండెడిది. దూరమున నేగోల వినవచ్చినను అది త్రాగుఁబోతుల గందరగోళమైయుండునని, గుమిగూడి వా రందఱును దౌర్జన్యము చేయవచ్చుచున్నారని యామె బెగ్గ డిలు చుండెడిది. కాబూలువాఁడుగూడ నమ్మఁదగని మను ష్యుఁడే యని, యాతని నడత నొకకంటఁ గనిపెట్టి యుండఁ దగునని యామె పలుమాఱు తన భర్తను హెచ్చరించు చుండెడిది. అట్టి సంశయమున కవకాశములేదని భర్త నమ్మఁ బలికినను ఆమె "* ఎవరూ ఎప్పుడూ ఎవరి పిల్లలను దొంగి లించుకొని పోలేదూ? కాబూలు దేశములో పశువులలాగునే మనుష్యులను అమ్మడము కొనడము జరుగుతూ ఉండడము లేదూ? పెద్ద రాతిసిలాంటి కాబూలీవాఁడు ఒక చిన్నపిల్లను దొంగిలించుకొని పారిపోవడములో అంత అసంభవము ఏ మున్నది?" అని మందలించినది. కాని 'మిని' తండ్రి

* శ్రీయుత వైకుంఠరావుగారి పరివర్తనమునుండి యుద్ధృతము.

కాబూలువానిని దన యింటికి రావలదని చెప్పలేక పోయి నాఁడు.

ఒకనాఁడు కాబూలువాని కప్పువడియుండిన పెద్ద మానిసి యొక్కఁడు చెల్లింపవలసినసొమ్ము చెల్లింపక యెగ వేయుట కుద్యుక్తుఁడై 'నీకు నేనేమియుఁ జెల్లింప నక్కఱలేదు' అని యెదురుదిరిగి యంతతోఁబోక పరుషపుఁగొట్టు మాట మిగిలినాఁడఁట. ఆ దుర్భాషణమునకుఁ గోపోద్రిక్తుఁడై కాబూలువాఁడు కత్తి చేఁబూని మాటమిగిలినవాని మీఁదికి దూఁకి గాయపఱచినాఁడఁట. వెంటనే కేకలు రేఁగినవి: గుంపులు కూడినవి: నెత్తురు వఱదలై ప్రవహించినది. రక్షక భటులువచ్చిరి. కాబూలువానిని బట్టి బంధించి తీసికొని పోవుటయు జరిగినది.

రక్షకభటులు కాబూలువానిని గొనిపోవుట 'మిని' తనయింటి గుమ్మమునుండి చూచినది: 'కాబూలీవాలా!' యని కేకవెట్టి యతనివైపు పరుగెత్తినది. ఆబిడ్డకేక విని దాని మూర్తిని గనుటతోడనే యతని మోమున నవ్వు తొంగిచూచినది. పూర్వపు హాస్యధోరణిలో మిని 'నీవు అత్తవారింటికి వెడుతున్నావా?' యని పలికినది. 'అవును అక్కడికే వెడుతున్నాను' అని యతఁడు బదులుచెప్పి పోయి నాఁడు.

అభియోగము విచారణకు వచ్చెను. అపాయకరమైన గాయము కలిగించినాఁ డన్న నేరము నిర్ధారితమయ్యెను. కాబూలువాఁడు తత్ఫలితముగాఁ గొన్ని వత్సరముల కారా గార మనుభవింప వలసినవాఁడయ్యెను. శిక్షపూర్తిగా ననుభ

వించి విడుదలనొంది యతఁడింటికి వచ్చినదినము 'మిని' వివాహమునకుఁ గుదిరిన సుముహూర్త దివసము. వివాహ మహోత్సవమున కన్ని యేర్పాటులును సంపన్నములయ్యెను. నానావిధాలంకారములతోఁ బచ్చతోరణములతో మంగళ ధ్వనులతోఁ బెండ్లియిల్లు వైభవోపేతమై చూపట్టెను. బంధు జనముల రాకపోకలు స్నేహితబృందముల పరస్పరకుశల ప్రశ్నములు విధి విరామములేక వెలయుచున్న యా సమయమున బంధనిర్ముక్తుఁడు కాబూలువాఁడు పెండ్లియింటిలోఁ బ్రవేశించినాఁడు. ఇంటి యజమానుఁడు "మాయింట నేఁడు శుభకార్యము: తొందఱ పనిలో నున్నాను" అని పలికి గిఱుక్కున లోనికేఁగ రెండడుగులు వైచినాఁడు. కాబూలువాఁడు బహిర్ద్వారము చేరఁబోయి, యేమనుకొన్నాఁడో, సంశయ హృదయముతోనే 'ఒకమాటు చిట్టిని చూడడానికి వీలు లేదా?' యని 'మిని' తండ్రి నడిగినాఁడు. 'ఈనాఁడు పెండ్లి. వీలుండదు.' అని బదులుపలుకు వినవచ్చినది. కాబూలు వాఁడు నిశ్చేష్టుఁడైనాఁడు. రెండునిమిషములైన తరువాత 'బాబూ సలాం' అని యతఁడు కడప దాఁటి కొన్నియడుగులు వైచి వెనుకకుఁ దిరిగివచ్చి 'ఈపండ్లు బాదముపప్పు చిట్టి కోసము తెచ్చినాను. ఆమె కీయండి యని 'మిని' తండ్రిగారి చేతిలోఁ బెట్టినాఁడు. ఆయన వాని కావస్తువుల వెల యీయఁ బోయినాఁడు "క్షమించండి. డబ్బు యీయకండి. ఈ ఉపకారము ఎప్పటికీ మఱచిపోను కాబూలీవాలా," యని బ్రతిమాలినాఁడు. "మీ పిల్లలాంటిదే నాకు ఒక కూతురు మా దేశములో ఉన్నది. ఆ మా చిట్టిముఖము మనసులో పెట్టు

కొని మీ చిట్టిచేతిలో నాలుగు పండ్లు పెడదామని ఇక్కడికి వస్తూఉంటాను. పండ్లు అమ్మడానికి రాను.'' అని యతఁడు సకరుణముగాఁ దన హృదయము విప్పిచెప్పి తన యంగీలో నుండి యొక కాగితముతీసి చూపినాఁడు. ఆ కాగితము నం దొక చిన్న చేతి చిహ్నము ముద్రితమైయుండెను. అది యాతని కూఁతు చేతిగుఱుతు. తనకుఁ బ్రేమాస్పద యగు పుత్రికను స్మృతికిఁదెచ్చు గుర్తుగల కాగితము నంగీలో భద్రముగా నుంచుకొని దేశసంచారము నెఱపుట యతని యుల వాటని వాని మాటలవలన 'మిని' తండ్రి గ్రహింపఁగలిగినాఁడు. తన ముద్దుకుమారిత చిన్నారిహస్తము నిరంతరము హృదయము నం దమృతము చిల్కరించుచుండ నతఁడు విదేశమునఁ బర్యటనము సాగించుచు వ్యాపారము జరుపుకొనువాఁడని స్పష్టమయ్యెను. 'మిని' తండ్రి నయనములు బాష్పపూరితము లయ్యెను. వెంటనే యాతఁడు లోనికరిగి పెండ్లికూఁతును వెంటఁబెట్టుకొనివచ్చెను. నవవధువుగదా! వయసునకు సందర్భమునకుఁ దగ్గ సిగ్గునిగ్గులతోఁ, బ్రక్కకుఁ ద్రిప్పినమోముతో 'మిని' తండ్రిదాఁపున నిలువఁబడెను. 'అత్తవారింటికి వెడతావు నీవు చిట్టి!' యని యామె నాతఁడు పల్కరించినాఁడు. లజ్జా భరమున నామె మాఱు పల్కక నిమిషమునే పట నిలువఁబడి లోని కరిగినది. కాబూలువాఁడు నిట్టూరుపువిడిచి నేలఁ జదికిలఁ బడినాఁడు. ఆతని హృదయవిహంగము ఱివ్వున దూరదేశపు టాఫ్ఘనిస్థాన ప్రాంతమున కెగిరిపోయి తనయింట వ్రాలినది. తన కూఁతు రెట్లున్నదో యేమో! 'మిని' వలెనే పెద్దదై

యుండుసుగదా! ఆమెతో మునుపటివలెఁగాక క్రొత్త ఫక్కి పరిచయ మారంభింప వలయుఁగాఁబోలు! ఈ విధమైన యూహలలో నతఁడు మునిఁగి పోయినాఁడు అతని యవస్థను 'మిని' తండ్రి చూచి, తన జేబులోనుండి యొక పెద్దనోటు తీసి వాని చేతిలోనుంచి 'రహమత్! నీవు నీ కూఁతురి యొద్దకు వెళ్లు. మీ సమావేశసౌఖ్యము మా 'మిని'కి మంగళకరమగునుగాక!' యని చెప్పి యతని వీడ్కొల్పినాఁడు. ఇది కథ.

కరుణ యొకజాతివాని సొంతకాణాచికాదు. పుట్టుకనుబట్టి యొకఁడు కటికివాఁడని మన మనుకొనవచ్చును. కాని యాతని హృదయము సుధాకలశమేమో మన మేమెఱుఁగుదుము? బాహ్యరూపమును వేషమును జూచి, మాటలను విని, మన మెన్నోతూరులు మోసపోవుదుము. మానవుని చేఁతలవలనఁగాని యతని నిజమైనవిలువ నిర్ణయింప వీలుకాదనుట నిశ్చయముకాదా? ముమ్మాటికి నిశ్చయము.

'ఎండ-నీడ' యనుపేరుగల రవీంద్రకవిరచితమైన కథయొకటి కలదు. దాని సంగ్రహాంశ మిది.:—

శశిభూషణుఁ డనుయువకుఁ డొకఁడు విద్యార్థిదశలో నున్నవాఁడు-గిరిబాల యను బాలిక-వీరిరువురు నొక పల్లెటూరియందున్నవారు: అకృత్రిమమైన జీవితము గడపు నమాయికులు. గిరిబాలకు రమారమి పది వత్సరముల వయస్సు. శశిభూషణుఁడా మందటనే యం. యే. బీ. యల్ పరీక్షలోను త్తీర్ణుఁడై వచ్చినవాఁడు. గిరిబాలతండ్రి పూర్వము భాగ్యవంతుఁడు. ఇప్పుడు చెడ్డదినములలోఁబడి, యాస్తి

లమ్ముకొనవలసినపరిస్థితి నంది, చిన్నయుద్యోగముతో జీవిక సాగించుచున్నాఁడు. శశిభూషణుఁ డేపనిలోను బ్రవేశింపలేదు. శాంతిప్రియుఁ డాతఁడు. బాహ్యప్రపంచముతో సంబంధము పెట్టుకొనక, యింటనేయుండి పుస్తకములు చదువుకొనుచు నానందించుచుఁ గాలము గడపుచున్నాఁడు.

గిరిబాలతోమాత్రము వినోదములాడుట శశిభూషణునికి దైనందినక్రీడ. ఆ చిన్నదాని కతఁడు చదువులోఁగూడ సాయపడువాఁడు. ఆ బాల చదువుగొడవ యామె యన్నలు పెట్టుకొన్నదే లేదు. శశి తన శిష్యురాలికి అక్షరక్రమము గుణితము చిన్నపాఠములు వ్యాకరణము మెలఁకువతోఁజెప్పి నేర్పినాఁడు. అంతేకాదు, తానుజెప్పెడి విషయము లామెకు బోధపడునా యను సందియమూనక తాఁజదువుకొను కావ్యములలోని సంగతు లుపన్యసించెడివాఁడు. ఆమె శ్రద్ధతో వినుచుండెడిది. ఈ విధముగా వారిమైత్రి పెంపొందినది.

గిరిబాల తండ్రి హరకుమారుఁడు. హరకుమారుని యుద్యోగములోఁ గొన్నిచిక్కులు తటస్థించెను. ఆతనికి, నతనిపై నధికారముగల పెద్దయుద్యోగులకు విరోధములు గలిగినవి. తన్మూలమున వ్యవహారములేర్పడెను. ఆతఁ డాకతమున శశిభూషణుని తోడ్పాటు నర్థించెను. శశిభూషణునికి వ్యవహార మిష్టముగానిదయ్యు, హరకుమారుని వేఁడికోలుమూలమున న్యాయస్థానముల కరుగుట విధిలేనిపని యయ్యెను. కాని హరకుమారుఁడు వ్యవహారములోదిగి, కొంత గ్రంథముజరిగినపిమ్మట గట్టిగా నిల్వఁబడలేక, ముందు

డుగు వేయలేక, వ్యవహృతి నుపసంహరించుకొని శశిభూషణు నికిఁ జెడ్డపేరు తెచ్చినవాఁడయ్యెను.

హరకుమార శశిభూషణులకు వైమనస్యము సంప్రాప్తమయ్యెను. దీనిమూలమున గిరిబాల జీవితమున మార్పు లేర్పడియెను. శశిభూషణునింటికి గిరిబాల పోఁగూడదని హరకుమారుఁడు గట్టికట్టడచేసెను. త్వరలో న త్తగారింటికి కరుగవలసిన వయసువచ్చినను సిగ్గులేనిదానివలె నితరుల యిండ్లకేఁగెదవా? యని తండ్రి కుమార్తెను జీవాట్లుపెట్టెను. కొంతకాలము జరిగినది. గిరిబాలకుఁ బెండ్లి నిశ్చితమయ్యెను.

ఆడంబరపూర్వకముగా వివాహయత్నము లారంభమైనవి. శశిభూషణుని కాహ్వానములేదు. ముహూర్తదినము వచ్చినది. ఆనాఁడే యతఁడు కలకత్తాకుఁ బడవపైఁ బయనమైనాఁడు. ఆతని సమ్మతి నపేక్షింపకయే కోర్టు వ్యవహారమేనాఁడు హరకుమారుఁ డుపసంహరించుకొనినాఁడో యానాఁటినుండి శశిభూషణుని మోమెత్తిచూచుటకే యతనికి బిడియమేర్పడినది. అతని యాకృతి కంటఁబడునేని శశిభూషణుఁ డసహ్యపడునని వాని నిశ్చయము. ఇయ్యదియే క్రమక్రమముగా ద్వేషరూపము తాల్చెను. శశిభూషణుఁ డూరు విడిచి పోవలసిన సంవిధానము సాధింప హరకుమారుఁడు పట్టుపట్టెను. దానికై పన్నుగడలు పన్నుట కారంభించినాఁడు. ఇట్టి వాతావరణమున గిరిబాల పెండ్లిముహూర్తము వచ్చినది. దాని నెదుర్కొను గుండెదిటవులేక శశిభూషణుఁడు స్వగ్రామము వీడ్కొని కన్నీళ్ల వర్షములోఁ దడియుచుఁ గలకత్తాకు బయలుదేరినాఁడు.

దారిలో నొక సంఘటనము. శశిభూషణుఁడు చేయు నది నదిమీఁదఁ బడవపయనము. ఒక స్టీమరు నదీప్రవాహ మున కెదురుగా మిక్కిలి వేగముతో వచ్చుచుండినది. దాని నతిక్రమింపవలయునను కుతుకముతో వెనుకనుండి యొక నావ పరుగెత్తుచుండినది. ఒకచోట నావ యడ్డదారి నవలం బించి స్టీమరును వెనుకవైచి పోఁగలిగినది. స్టీమరు మేనేజ రొక తెల్లదొరగారు. తన స్టీమరుతో నింకొకనావ పోటీ చేయుటాతనికిఁ గంటకమయ్యెను. నిండువడితోఁబోవు నావ నుగని యాతఁడు చప్పునఁ దన తుపాకిఁ దీసి బారుచేసి తెర చాపకు గుఱిపెట్టి ఢమ్మని గుండుపేల్చినాఁడు. చాప చీలిక పేలికలైపోయినది ఇంకేమి జరిగినదో! తటాలున నావ నదీ గర్భముఁ జొచ్చినది. ఎందఱో చచ్చిరి.

శశిభూషణుఁడు జరిగినదంతయు సాక్షాత్తుగాఁజూచి వేగిరపడి తానున్న పడవను బరుగులెత్తించి, మునిఁగిపోవు వారిని వీలైనంతమందిని సమయస్ఫూర్తితో రక్షించినాఁడు: స్టీమరు మేనేజరుమీఁద సొంతడబ్బు వెచ్చించి కేసు పెట్టించి నాఁడు. కాని స్టీమరులోనుండి చూచినవారు తాము గన్ను లారఁ గన్నదానినిగూర్చి సాక్ష్యము చెప్పుటకు భయపడి 'మాకు ఎవరు ఏమిచేసినది కనఁబడలేదు' అని చెప్పెద మనినారు. మొండి ధైర్యముతో శశిభూషణుఁడు కేసునడిపి నాఁడు. దానికి సాక్షులతో నక్కఱయేలేని పరిణామము తటస్థమయ్యెను. ఆకసమున నొక కొంగలబారు పోవుచుం డఁగా దాని గుఱిపెట్టి తాను దుపాకిఁ బేల్చినది నిజమే యనియు, స్టీమరు వేగముగాఁ బోవుచుండినదనియు, గుండు

దేనికిఁదగిలినదో యేమో తానెఱుఁగఁడనియు దొరగారు వాక్రుచ్చిరి. దొరగారు నేరముచేయలేదని న్యాయమూర్తి తీర్పుచేసెను.

శశిభూషణుఁ డిల్లుచేరినదినమే గిరిబాల యత్తవారింటి కరిగినది. ఆమె మోమైన ఒక్కసారి చూచు భాగ్యము శశిభూషణునికి లభింపలేదు.

రెండునదుల సంగమప్రదేశములో జాలరులు జలప్రవాహమున కడ్డముగా వెదుళ్లునాటి వలపన్ని చేఁపలుపట్టుట సామాన్యముగా జరుగుపని. ఒక నైపు పడవల రాకపోకలకు వీలుండునట్లు వారు చోటువదలుదురు. ఈ విధముగా ధీవరు లెన్నో సంవత్సరములనుండి తమ వృత్తి నిర్వర్తించుకొనుచుఁ బ్రభుత్వమువారి కేఁటేఁటఁ గొంత పన్నుగూడఁ జెల్లించుచుండుట సర్వజన విదితము.

శశిభూషణుఁడు కలకత్తా కొక పర్యాయము నదిమీఁదఁ బడవలోఁ బయనించునాఁడు రెండు ప్రవాహము లొకచోఁ గూడుచోట జాలరులు పైవిధముగాఁ జేఁపలు పట్టుచుండిరి. శ్వేతముఖుఁడు - మండలరక్షక భటాధికారి యొకఁడు ఆ మార్గమున ఒక నావలో వచ్చుచుండెను. ఆనావ యమితవేగమూని యరుదెంచు చుండినది. అడ్డముగానున్న వలను జూచియు నధికారమదాంధకారమునఁ గన్నుగానక తన నావ నయ్యధికారి వలలోనికిఁ బోవనిచ్చెను. నావచుక్కాని వలలోఁ దగులుకొనెను. ఆ చిక్కులోనుండి చుక్కానిని వెలువరించుటకు విధిలేక కొంత యాలస్యమయ్యెను. జాతిచేఁ దెల్లవాఁడు - చేతిలోనున్నది చేయునది పోలీసుద్యోగము -

ఇఁకఁ దాఁ జేయలేని పనియేముండును? ఆతఁడు వల్లను ముక్కలు ముక్కలుగాఁ దెగఁగోయించినాఁడు. అయిదాఱు వందల రూపాయల వెలగలది, బీదజాలరుల వల భగ్నమై పోయినది. అంతతోఁ దనకసి దీఱియుండవచ్చునుగదా! తీఱ లేదు. జాలరులఁబట్టి తెప్పించి తన నావలో నిలువఁబెట్టించి బంధింపించినాఁడు.

ఈ దౌర్జన్య మామూలాగ్రము చూచుచుండిన శశి భూషణుని యెదలో నాగ్రహము ప్రజ్వరిల్లినది. గబ గబ దొరను సమీపించి 'పేదజాలరులవల ముక్కలుచేయుటకు, వారి నీరీతి బాధించుటకు మీ కేమాత్రమూ అధికారము లేదు.' అని శశిభూషణుఁడు గద్దించినాఁడు. దొర చీకాకు పడి, హిందూస్తానీ బాసలో నీచమైనవారికిని సహింపరాని తిట్టొకటి శశిపైఁ బ్రయోగించినాఁడు. శశి యా తిట్టువిని తెల్లదొరపై దూఁకి గట్టిదెబ్బ కొట్టినాఁడు. ఆపై నేమి జరిగి నదో శశి యెఱుఁగడు. స్మృతికివచ్చి చూచుకొను నప్పటి కాతఁడు పోలీసుల యధీనములోనుండెను. కేసు విచారణకు రాఁగా, జరిగినది జరిగినట్లు శశిభూషణుఁడొప్పుకున్నాఁడు. మూఁడునాలుగు నేరములాతనిపై మోపఁబడినవి. అయిదు సంవత్సరముల కారాగారవాస మతఁడనుభవింపవలసివచ్చి నది. అనుభవించినాఁడు. అది నిశ్చయముగా నరకమే. చెఱ సాలనుండి తిరిగి వచ్చుసరికి శశిభూషణుఁడు తన సర్వస్వము కోలుపోయినాఁడు. ఆతని యాస్తి రివిన్యూ వేలములో హరకుమారుఁడు కొనుటయు స్వాధీనము నొందుటయు జరిగి నది. శల్యావశిష్టుఁడై నిరుత్సాహముతోనుండి యతఁడొక

నాఁడు విడుదలనొంది, ద్వారము వెలువడి వచ్చుసరికి రెండు గుఱ్ఱములబండి యొకటి సిద్ధమైయుండెను. ఆ బండినుండి యొకఁడు దిగివచ్చి, 'అయ్యా, మీరేనా శశిభూషణ బాబు గారు?' అని యడిగి యాతఁడే యని తెలిసికొని వెంటనే బండియెక్కించుకొని తీసికొనిపోయి, యొక సుందర భవనమునఁ బ్రవేశింపఁ జేసినాఁడు: సోఫాలున్న యొక గదిలోనికి దారిచూపి యొక్క చక్కని కుర్చీమీఁదఁ గూర్చుండఁ బెట్టి నాఁడు. ఆ గదిలో నెన్నోపుస్తకముల బీరువలుండినవి. ఒక బల్లపై నొక ప్రాఁతపలక కాన వచ్చినది. దాని కొయ్యజవ మీఁదఁ బెద్దయక్షరములతో 'గిరిబాలా దేవి' యని వ్రాయఁ బడి యుండినది. ఆ వ్రాఁత శశిభూషణుని కంటఁబడినది. ఆ యక్కరములు తనవేయని యతఁడు గుఱుతింపఁ గలిగినాఁడు. అది 'గిరిబాల' యిల్లని మెఱపు మెఱసిన ట్లతని స్మృతిపథమునఁ దగిలినది. చిన్ననాఁటి కథలెల్ల వాని స్ఫురణకు వచ్చినవి. అడుగుల చప్పుడు వినఁబడ నతఁడు కన్నెత్తి చూచి నాఁడు. ఫలములు తినుబండములు గల వెండిపళ్లెరము తన మ్రోలనుంచి, చెంత నిలువఁబడియున్న యొక స్త్రీ మూర్తి యాభరణములులేని శరీరముతోఁ దిలకములేని నుదురుతో అంచులులేని తెల్లచీరతో శశికిఁ బొడసూపెను. ఆతని చూపు తనపైఁ బడుటతోడనే యా బాల వాని పాదములను గన్నీటి జలముతో నభిషేకించినది. శశి మాటాడఁదలఁచెను గాని, యేమనుటకు నోరురాలేదు. గిరిబాలా శశిభూషణుల పునస్సమావేశముతోఁ గథ కంచికిఁ బోయినది.

దుఃఖము - సుఖము, పగ - చెలిమి, చెడ్డ - మంచి, ఎండ - నీడ: ఇవి యొకదాని వెంటనొకటి యెడతెగని వరుసవున వచ్చుచుండును. వీనిలో గుఱుతింపఁదగినది చక్రనేమిక్రమము. ఈ కథలో రవీంద్రుఁడు మానవ జీవితములోని విషమ సంఘటనములను, మంచికిఁ బోయిన వచ్చు చెడ్డలను, సంయోగ సౌభాగ్యములు సమకూడవలసినప్పుడు తారసిల్లు వియోగ విపత్తులను సిద్ధహస్తుఁడుగాఁ జిత్రించుట కానవచ్చును.

గిరిబాలా శశిభూషణుల పునస్సమావేశముమాత్రము చూపి వారావలఁ దమజీవితశేష మెట్లుగడపిరో యా వివరములు రవీంద్రుఁడు చదువరుల యూహలకు వదలినాఁడు. ఎవరి బుద్ధులకుఁ దగినట్లువారు, ఎవరి రుచి కొప్పినట్లువారు, ఎవరి సంస్కృతి కుచితమైనట్లు వా రూహించుకొనవచ్చును. పాఠకుల కొక సమస్య కల్పించి యిచ్చినాఁడు రవీంద్రుఁడు. మీరే పూరించుకొను డని యన్నాఁడు. యోచన చేయుఁడు పూరింపఁగలిగినఁ బూరింపుఁడు. రవీంద్రుని చిన్నకథల ప్రస్తావ మింతటితో ముగించి, యతని బృహద్గద్యకథాప్రబంధముల పరిచయ మించుక కలిగించుకొందము.

* 'ఇంటా - బయటా' యనుపేరుతోఁ దెలుఁగుబాస లోని కనువదింపఁబడిన రవీంద్రుని కథ ప్రసిద్ధమైన దొకటి.

* శ్రీ కౌరుమూరి వైకుంఠరావుగారి యనువాదము- శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ - సన్స్ వారి ముద్రణాలయమున ముద్రితము - (1928.)

కలదు. ఆంగ్లమున 'The Home and the World' అను పేరుతో నీకథ ప్రకటితమైనది.

1905 లో వంగరాష్ట్రమును బ్రిటీషు పరిపాలకులు రెండు ఖండములుగా విభజించిరి. పరిపాలనా సౌలభ్యము నిమిత్తము తా మీవిభాగ మొనరించితిమని యాంగ్లేయులు ప్రకటించిరి. వంగదేశీయులు మాత్ర మీ కార్యము క్షమింపఁ దగని పోకిరితనముగా సహింపరాని దురాగతముగా భావించిరి. తమ జాతీయోద్యమమును విధ్వంసించుటకై వారు పన్నిన పన్నుగడయని వంగరాష్ట్ర ప్రజల నిశ్చయము. దీనికి ఫలితముగా బంగాళమున విదేశవస్తు బహిష్కారము బహుముఖములఁ జెలరేఁగెను. బందిపోటుదొంగతనములు హత్యలు ప్రారంభమై దేశమును గలఁతపెట్టినవి. ఈయుద్యమములయందు ద్రేకముతో దూరి యెంతో దారుణచర్య లొనర్చినవారు ప్రాయికముగా విద్యార్థులే. ఈ యుద్రేకము రవీంద్రునికి సమ్మతము కాదు. ఈ విప్లవవిధానమును ఖండించుటకై యాతఁడు రచించిన గ్రంథమిది.

సందీపుఁడనువాఁడు మూర్తీభవించిన విప్లవమనఁదగిన సాహసికుఁ డొక్కఁడుండెను. ఆతఁ డుపన్యాసములిచ్చి ప్రజల హృదయము లుద్రేకపూరిత లూఁగించుచుండెను. తా నుద్దేశించిన పనులు నెఱవేర్చుట కెట్టిదుండగమునైన ముందు వెనుక లరయక చేయువాఁడతఁడు. ఆతని బుద్ధి సునిశితమైనది. కాని వానిది పెలుచని హృదయము.

సందీపుని మిత్రుఁడు నిఖిలుఁడు. నిఖిలునిది కోమలమైన స్వభావము. ఆతని కుద్రేకపు మాటలు పనులు గిట్టవు.

దయ్యముపట్టినవానియట్లు ద్రాగుఁబోతువలె నెట్టి యుద్యోమము నందైన నుద్ధతితో నావేశముతో దిగి మునిఁగి యూఁగి సాగి సంరంభించుట నిఖిలుని ప్రకృతికి సహింపరాని పద్ధతులు.

నిఖిలుని భార్య విమల. ఆమె సందీపుని వావాదులు విన్నది. ఆమె రక్తమున కుడుకెక్కినది. దేశమునకై యాత్మసమర్పణము కావింపవలయునన్న యుల్లాసమామె యుల్లము నాక్రమించినది. తన్నుఁదా నీయత్నములో నశింపఁ జేసికొనుటయే యధికానందప్రదమైనపనియని యామె భావింప నారంభించినది. ప్రపంచమున మహాపురుషులని పేరుగన్న వారెల్లరు క్రూరులై వర్తించినవారేయనియు, న్యాయముగా నడచుకొనుట సామాన్యుల ధర్మమనియు, నన్యాయము సామాన్యుల ధర్మమనియు, మనుష్యులు కానిండు, జాతులు కానిండు క్రౌర్యాన్యాయము లవలంబించి గొప్పతన మార్జింపఁగలిగి రనియు రాజ్యాధికారములు సంపాదింపఁగలిగిరనియు, న్యాయమని ముక్కుమూసికొని యుండుట తెలివిమాలినతనమనియు సందీపుఁడు నిరాఘాటముగాఁ దన యుపన్యాస ప్రసంగములలో విన్యాసము చేయుచుండెను. పూర్వకాలపు అలెగ్జాండరు చక్రవర్తి మొదలుకొని యిటీవలి యమెరికా దేశపు కోటీశ్వరుఁడు రాక్ఫెల్లరువఱకుఁ బ్రతిమానవుఁడును దనకుఁ దోఁచిన స్పష్టమైన యాకృతిని తాను దిద్దుకొనవలయును. లేకున్న గ తాను గతికమైన చచ్చు బ్రదుకు బ్రదికినట్లే యని యతఁడిండ్లకప్పు లెక్క చాటుచుండును. రామాయణమునకు నిజముగా నాయకుఁడు రావణాసురుఁడఁట. సీతమ్మను దన యంతఃపురములోనికిఁ దీసికొనిపోయి పెట్టుకొనక యశోకవనములో

నుంచుట యాతని తెలివిమాలినపనియఁట. మహావీరుఁడైన యాతని తత్త్వమునందలి లోపమిదియేనఁట. ఈ యతని మెత్తందనమే లంకాసామ్రాజ్యకాండము భగ్నమై పోవుటకుఁ గారణమైనదఁట. ఈ సంకోచమే యతనికి లేకుండినచో సీత యతనిఁ బూజించియుండెడి దఁట. విభీషణుని గడతేర్పక విడిచిపెట్టుటకునుగూడ రావణుని మెత్తందనమే హేతు వనియు విభీషణుఁడు తన విరోధితోఁ జేరకుండిన, పరిణా మము భిన్నముగా నుండెడిదనియు సందీపుని మతము. ఈ మతమునే యతఁ డితరుల కుపదేశించుట. ఈయన బోధలకు లొంగి శిష్యులైన పిన్నపెద్దలు పెక్కుమంది. అమూల్య చరణుఁడను యువకుఁడొకఁడు వీరిలో ముఖ్యుఁడు. ఇతఁడు సందీపునికి భక్తుఁడైనాఁడు. ఒక్కక్షణములో నా బాలుని మనసువత్తికి సందీపుని యుపదేశజ్వాల యంటుకొన్నది. వెలుఁగుట ప్రారంభమైనది.

సందీపుఁ డీ చందమున దీపము లనేకములు వెలిఁ గించినాఁడు. దేశములో నొక నాఁ డెప్పుడో పెను దీపావళి పండుగ ప్రజ్వరిల్లు నట్లుండినది. విద్యార్థులు చదువులు మాను కొనిరి. సందీపుఁడు వారందఱికి గురువైనాఁడు. స్వదేశవస్తు ప్రచారములు విదేశవస్తు బహిష్కారములు ప్రబలినవి. అప్పు తెచ్చుకొని పేదవర్తకు లమ్ముకొను విదేశపుబట్టలు తగులఁ బెట్టుట దేశభక్తుల మనువారికిఁ బరిపాటి యైనది. తమ రాజ్యములను సామ్రాజ్యములు కావించినవారు క్రొత్తసంఘ సంప్రదాయములను నూతన మతములను స్థాపించినవారు అబద్ధములకు జడియు లేదని, కల్లలే పాలకులకు వృద్ధిసోపా

నములని, సత్యములు పాలితులపాలి సంకెలలని, రాష్ట్రీయ యజ్ఞములకు రంగమగు పృథివీ దేవతాయాగశాలలోఁ బచనము చేయఁబడు రాచటికపు వంటకములలో గుబాళించు మసాలా దినుసు లనృతములని, యారగించువారికి వంట పద్ధతిలోఁ బ్రమేయములేదని, తినుటయేవారి విహిత విధియని, మానవుని లక్ష్యము సత్యముకాదని, ఫలలాభము మాత్రమే యని, సకలనీతిసార మిదియే యని, సందీపుఁడు తన యనర్గళ వాఙ్ముఖ ప్రవాహములను శ్రోతలపైఁ బ్రవహింపఁ జేయుచుండెను.

తాఁ దలపెట్టిన యుద్యమమును సఫలముకావించుట కత్యవసరముగా నయిదువేల రూపాయలు కావలయునని సందీపుఁడు విమలాదేవిని కోరినాఁడు. తెచ్చియిచ్చెదనని విమల వాగ్దానముచేసినది. ఎట్లు తేఁగలదు? ఎట్లో తెచ్చి యిచ్చివేయవలయునని యామె నిశ్చయించుకొన్నది. ఏమి చేసితెచ్చినను తప్పులేదనికదా సందీపునిబోధ! పాపము లేదు. పాపపుణ్యావివక్ష దీనులకే యని సందీపుని యుపదేశము. సామాన్యుఁడైన పేదవాఁడుచేసిన యన్యవస్త్వపహరణము చౌర్యము. రాజు కావించిన యాక్రమణము శౌర్యము. ఈ యభిప్రాయములన్నియు విమల హృదయమునఁ జిందులు త్రొక్కినవి. అమూల్యచరణునిఁ బిల్చి దేశసేవ నిమిత్తము ధన మత్యవసరమని యెస్టేటు బొక్కసమునుండి యెట్టి మార్గముచేనైన డబ్బు తెచ్చియీయఁగలవా? యని విమల యడిగినది. సందీపుని ప్రియశిష్యుఁడు - తాను నమ్మినబంటు - అమూల్యచరణుఁడు బజారు లూటీచేసియేని తెచ్చియిచ్చెద

నన్నాఁడు. పరస్పర విరుద్ధభావముల సంఘర్షణము విమల హృదయమును విదళించి కుదిలించినది.

ప్రతిసంవత్సరము దుర్గాపూజావారములో నిఖిలుఁడు తన యిద్దఱు వదినలకు ఒక్కొక్కతెకు మూఁడువేల రూపాయలవంతున రొక్కమిచ్చెడువాఁడు. వారిపేర కలకత్తా బ్యాంకీలో డబ్బుకట్టుచుండువాఁడు. ఆ యేఁడు కట్టవలసిన మొత్తమతని యినుపపెట్టెలో భద్రపఱుపఁబడియుండినది. భర్తగారి తాళపుగుత్తిఁ గొనివచ్చి, పెట్టె గుట్టుగాఁ దెఱచి, కాసులదొంతులు సంగ్రహించి విమల సందీపుని కిచ్చినది. మూటకట్టుకొని యతఁడు కొంపోయినాఁడు.

కాసులదొంతులు దొంగిలించి సందీపునికి దత్తము చేసిన నిముసమునుండియు విమలచిత్తమున సంక్షోభ మారంభమైనది. నిలువలేక పోయినది. అమూల్య చరణుని బిలిచినది. అతని చేతికిఁ దనవిలువగల నగలిచ్చినది. తీసికొని పోయి అమ్మియో, తాకట్టుపెట్టియో, యెట్లో యాఱువేల రూపాయలు సేకరించుకొని రమ్మనిపంపినది. ఆమె చెప్పినట్లు గాక మార్గాంతర మవలంబించి యతఁడు ధనము సాధించి యామెకీయవచ్చినాఁడు. ఏదో నేరముచేసి యా యువకుఁడు ద్రవ్యము తెచ్చియుండవలయునని విమల భయపడి తన కా ధనమక్కఱ లేదనియు, దానినెచ్చటినుండి తెచ్చెనో యచ్చటికి వేగిరముగాఁ జేర్చిరమ్మనియు విమల వాని కాజ్ఞాపించెను.

విమలా సందీపుల సాంగత్యదీపము స్నేహవిహీనమై వెలవెలఁబాఱఁజొచ్చెను. నిఖిల సందీపుల సందు వైమనస్యము

మొందయ్యెను. సందీపుఁడు తదనుచరులు తచ్ఛిష్యగణములు ప్రజలపై దురహంకారాధికారము నెఱపి సంఘజీవితము కలఁతవెట్టుచున్నందున నాలుగైదు దినములలో సందీపతత్త్వ ప్రచారకులందఱు కదలి యూరువదలి పోవలయునని నిఖిలుఁడు మోమోటపడక స్పష్టముగాఁ దెలియఁజేసెను.

విప్లవశక్తుల నెదుర్కొనుటకై నిఖిలుఁడు చేయఁగలిగిన యత్నముచేయఁ దొడఁగినాఁడు. కాని యేవంకఁగనుఁగొన్నను దురుద్ధతివ్యాపనము హద్దుమీఱుచుండినది. తన కపకీర్తి విస్తరించినది. వార్తాపత్రికలలోఁ దన్నుఁ గూర్చిన నిందారోపణలు దూషణములు ప్రకటితము లగుచుండినవి.

నిఖిలుని యెస్టేటు బొక్కసముమీఁద దివిటీ దొంగలు పడి యాఱువేలరూపాయలు హరించిరని యలజడి పుట్టినది. పోలీసు లెంతో శ్రమపడి భోగట్టాచేయుచుండిరి. తుట్టతుద కమూల్యాచరణుని చేతిలో నాఱువేలరూపాయల కరెన్సీనోట్ల కట్టలు పట్టువడినవి.

నిఖిలుఁడు తన వదినలపేర డబ్బుకట్టఁదలచి పెట్టె తెఱచిచూడ సమకట్టగాఁ, దా నాపైకము తీసికొని వెచ్చించి నట్లు విమలాదేవి వెల్లడించినది. ఆమె మనోవ్యథ మితిలేని దయ్యెను. ఆమె వల్లభుని హృదయాందోళన మంతములేని దయ్యెను. తన ప్రేయసి మానసమున మానరాని గాయమైన దని నిఖిలుఁడు గ్రహించినాఁడు. ఆ గాయమును దనప్రేమతోఁ గప్పి కట్టుగట్టఁ దలంచినాఁడు.

విమల నిద్రాహారములు మానినది: దుఃఖముతోఁ గుమిలి కూఁశారినది. ప్రాణవిభుని పదముల కభివందన మాచ

రించినది. పూజించినది. ప్రేమతరంగిణి భక్తిసాగరములోఁ గలియు ఘట్టమునకు యాత్రచేయ బయలుదేర నిశ్చయించుకొన్నది.

అప్పట్టున మహమ్మదీయు లనేకులు గుంపులు గుంపులుగా ఖడ్గాది సాధనములు మారణయంత్రములు పూని యేస్టేటు బొక్కసముపై దాడిచేసి దోఁచుకొని యడ్డము వచ్చిన పురుషుల హింసించి స్త్రీల నవమానించి యేవేవో వినరాని కనరాని దురాగతము లొనర్చుచున్నారని గోల రేఁగెను. నిఖిలుఁడు నిలువక యాలోచింపక గుఱ్ఱమెక్కి నిరాయుధుఁడుగా దుండగములు జరుగుచున్న చోటికిదూఁకినాఁడు. అది రాత్రి పదిగంటలవేళ. భయంకరధ్వనులు కేకలు రోదలు గద్దింపులు ఆక్రందనములు వినవచ్చుచుండినవి. జనసమూహాముల కలకలములు మిన్నుముట్టుచుండినవి.

ఇంతలో వేగముగా డోలీలు కొన్ని నిఖిలుని సింహాద్వారమునకు వచ్చినవి. వానివెంట డాక్టరు పరుగిడి వచ్చినాఁడు. 'ఏలాగున్నదండీ! డాక్టరుగారూ?' అని దివాన్జీ ప్రశ్నించినాఁడు. 'చెప్పడం కష్టం, తలకు తగిలిన దెబ్బ అపాయకరమైనది.' అని డాక్టరు బదులు పలికినాఁడు. 'అమూల్యబాబు?' 'ఇంకేమి అమూల్యబాబు', గుండెలో నుండి గుండు వెళ్ళిపోయింది.' అను ప్రత్యుత్తరముతోఁ గథ సమాప్తి.

ఈ కథ పూర్తిగా మెలఁకువతోఁ జదివినవారికి నిఖిలుఁడే రవీంద్రుఁడని స్ఫురింపకమానదు. సందీపుఁడే నాఁటి విప్లవశక్తి స్వరూపుఁడు. ఆతని యుద్రేకపు టుచ్చులలోఁ

దగుల్కొని యుక్కిరి బిక్కిరియైన యమాయిక విమల. ఆతని యజ్ఞశాలలో వపాహోమము చేయఁబడిన యువజీవ ద్రవ్య మమూల్యచరణుఁడు. ప్రాణోపద్రవకరమైన దెబ్బ తగిలిన దెవ్వనికో పర్యవసానమేమో స్పష్టముగాఁ జెప్పక విడిచినాఁడు రవీంద్రుఁడు. ఆ దెబ్బతిన్నవాఁడు నిష్కల్మష మూర్తి నిఖిలుఁడే యేమో! పాపము! దురంతములు జరుగు చున్నవని చంద్రనాథుఁడు చెప్పినవార్త విని వేగిరపడి గుఱ్ఱ మెక్కి వాయువేగమునఁ బోయినవాఁ డతఁడేకదా! 'నీవు చచ్చిపోక మాయబ్బాయిని మృత్యుముఖమున వేసితివిగదే!' యని తోడికోడలు రానున్న యమంగళము విమలకు సూచించినదికాఁబోలు. పై శాచికోపన్యాసములిచ్చి ప్రచండ విప్లవశక్తులు రేఁపిన సందీపుఁ డేమైనాఁడో! సమయమునకు ముఖముతప్పించినాఁడా? లేక, ప్రళయములో నామరూప ములులేక రూపఱినాఁడా? దీనిభావమేమో, తిరుమలేశుఁడే చెప్పవలయును.

రవీంద్రుఁడు రచించిన మఱియొకకథనుగూర్చి యించుక ముచ్చటించెదను. నౌకాభంగవృత్తాంతముతో నారంభమగునట్టి కథ యొకటి యతఁడు సంతరించి యున్నాఁడు. అది * 'పడవమునుక' యను పేరుతోఁ దెలుఁ గునఁ బరివర్తితమైయున్నది. దాని కథాసంగ్రహ మిది.

రమేశుఁ డనుయువకుఁడు క్రొత్తగా న్యాయశాస్త్ర మునఁ బట్టభద్రుఁడై పరార్థవాది వృత్తిలోఁ బ్రవేశించి

---

* శ్రీ కానుమూరి వైకుంఠరావుగారి యాంధ్రానువాదము శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ బ్రకటితమైయున్నది.

నాఁడు. అప్పటి కతనికిఁ బెండ్లి కాలేదు. అతని తండ్రి యతని కొక సంబంధము నిశ్చయముచేసికొని వచ్చినాఁడు. వధువు తండ్రికి మాట యిచ్చినాఁడు. తన యభిప్రాయ మడుగక యే తండ్రి యీ వివాహనిశ్చయము చేసినను రమేశుఁడు పెండ్లి కభ్యంతరము కలిగింపలేదు. పల్లెత్తుమాట యేని జనకుని నిర్ణయమున కడ్డము చెప్పలేదు. వివాహము జరిగినది.

పల్లెటూరి పడుచైన వధువును వెంటఁబెట్టుకొని రమేశుఁడు గంగానదిమీఁదఁ బడవలోఁ బయనమై కలకత్తాఁ జేర వచ్చుటలో, రాత్రివేళ గాలివాన మెండైనది. కల్లోలములు పడవ నూఁచివైచినవి. నౌకాభంగము తటస్థించినది. తెల్లవాఱినది. దైవవశమున రమేశుఁ డొకయిసుకదిబ్బపై మేల్కాంచినాఁడు. ఆ దిబ్బమీఁదనే యొకవంక నొక క్రొత్త పెండ్లికూఁతురు ప్రాణములతోఁ బడియుండుట రమేశుఁడు గుఱుతింపఁ గలిగినాఁడు. ఆపె తాఁ బెండ్లాడిన పిల్లయే యై యుండునా? యని రమేశునికి సందేహము కల్గినది. పెండ్లి సమయమున నామె మోమైన సరిగా నొకసారి యతఁడు చూచినవాఁడుకాఁడు. పెండ్లికి ముందు పెండ్లికూఁతును జూచినవాఁడేకాఁడు. ధైర్యము తెచ్చుకొని బిడియము విడనాడి యాపె నతఁడు పల్కరించినాఁడు: పేరడిగినాఁడు. 'నా పేరు కమల' యని చెప్పిన దాచిన్నది. తనభార్య పేరదికాదు. తన వలెనే పెండ్లికూఁతుతోఁ దరలివచ్చిన మఱి యొక జట్టునుండి విడివడిన పడఁతుకయైయుండు నీ చిన్నదని రమేశుఁడు నిర్ధారణచేసికొని, యామె బంధువు లెవరో యామె దేయూరో క్రుచ్చి క్రుచ్చి యడిగినచో నామె నొచ్చు

కొను నేమోయని శంకించి, యామెను రక్షించుట మాత్రము తన కర్తవ్యమని తేల్చుకొని, ప్రయాణికులఁ గొనిపోవు పడవయొకటి కనఁబడగాఁ గమలతో దాని నెక్కి కలకత్తా చేరుకున్నాఁడు.

కమల తన మనస్సులో రమేశుఁడు నిజభర్తయే యని నిశ్చయించుకొనినది. కాని 'నాస్వామ్యము నే ననుభవింప వలదా? నేను నీ భార్యనుగదా, నా స్వామ్యైన సుఖమును నాకీయవేమి?' యని తానడుగ సాహసింపలేదు. సాహసించి యడుగుటకుఁ దగిన వయసురాని బాలికయై యుండునేమో! ఆమె భర్త చనిపోవక బ్రదికి యున్నాఁడేమో!

రమేశుఁడు తన పెండ్లికి మునుపు కలకత్తా పట్టణమునఁ దా నేయింటఁ గాపురముండెనో దాని పొరుగున నలిని యను పెండ్లియీడుపిల్లతో మంచి పరిచయము గలిగించుకొని యుండెను. నలిని విద్యావతియే కాక గుణవతియు. ఆ పరిచయము ప్రణయముగాఁ బరిణమించెను. ఆ ప్రణయవల్లి పెంపొంది పుష్పించి ఫలించులోపల దైవవశమునఁ దండ్రి కుదిర్చిన పెండ్లి తుపాను సందర్భించెను. ఆ సంబంధము తుపాను కతమునఁ దెగిపోయిన పిమ్మట, రమేశుఁడు నలినితోఁ బునఃపరిచితి నెఱపినవాఁడయ్యెను. కమలాసంరక్షణము – నలినీస్నేహము: ఈ రెంటినడుమ రమేశుని జీవిక యడకత్తులోనిపోక చందమయ్యెను.

నలినీ రమేశుల మైత్రిని గత్తిరింప నక్షయుఁడనువాఁడు చేసిన తంత్రములతో, రమేశుని వర్తనము హేతువుగాఁ, గమల మదిలోఁ జెలరేఁగిన ఝుంఝూ మారుతములతో,

ఆమెను బెండ్లాడిన నలినాక్షుఁడు రంగమునఁ బ్రవేశించు టతోఁ, గథ రక్తికెక్కును. చిట్టచివర కెవరిసంగతి యే మగునోయను కుతూహల మనుక్షణము చదువరుల మదినుద యించు చుండును. మానవ హృదయములయందలి లోఁతు పాఁతుల నరసి భిన్నప్రకృతుల శీలవైవిధ్యమును రసవంత ముగాఁ జిత్రించిన కథకుని నైపుణ్యము పాఠకుల కీ గ్రంథ మున విశిష్టముగా విస్పష్టమగును. సామాన్య జీవితమునకు సంబంధించిన కథా సృష్టికలదగుటయే యీ రచనము గొప్ప తనము. రమేశుని మనసును నలిని హరించినది: నిజమే, కాని తండ్రిమాట దూరీకరింపలేక యతఁడు గొనివచ్చిన సంబంధమున కీయకొని, పెండ్లి కంగీకరించి, రమేశుఁడు పితృవాక్య పరిపాలనము కావించినాఁడు. దీనిలో మఱియొక త్యాగవిశేషము కలదు. రమేశుని తండ్రికిఁ జిన్ననాఁటి స్నేహితుఁడొకఁడుండెను. ఆతఁడాకస్మికముగా మరణించుట తటస్థించెను. ఆతని బిడ్డలు నిస్సహాయులు నిరాధారులుగా నిల్చిరి. ఆ నిరాధార కుటుంబములోని పెండ్లియీడుపిల్లను రమేశునితండ్రి తన కోడలుగా గ్రహించుట మేలని పెండ్లి నిశ్చ యము చేసినాఁడు. తండ్రియాశయమును గౌరవించి తానును దనకుఁదగిన త్యాగమొనరించుట శ్లాఘాపాత్రమని రమే శుఁడు భావించినాఁడు. నలినీకమలల నడుమఁ దాఁజూపిన మెలఁకువ మఱింత స్తుత్యార్హముగదా! విషమ పరిస్థితులలో రమేశుఁడు ప్రకటించిన మనోనిరోధము మాననీయము. ఇత రుల కష్టసుఖములతో మన కేమిపని? మనయానుకూల్య ములకే ప్రాధాన్యమీయ వలయునన్న మనస్తత్త్వముగల

స్వార్థపరులు రమేశునిఁజూచి నేర్చికొన వలసిన గుణపాఠము లెన్నోకలవు. ఒక పని వలన పరహృదయము సుఖపడునా బాధపడునా? ఆ పనిచేయకున్న మనమెవరికైనఁ జింత కల్గింతుమా? చేసిన, మేలుచేసినవార మగుదుమా? యను దృష్టితో స్వీయవర్తనమును దిద్దుకొన్న సాధుపుంగవుఁడు రమేశుఁడు. ఈ దిద్దుబాటులలో నతఁడెంతో విషాద మనుభవించినాఁడు. కమల నిష్కల్మష శీలమును నలినాక్షునికి నిరూపింప నెంతో శ్రమపడినాఁడు. అతఁడు నిశ్చయముగా ధీరుఁడు.

కథాకల్పనముకంటె రవీంద్రుని రచనములలోఁ బేర్కొనఁదగినది మానవ స్వభావచిత్రణమే యని యంగీకరింపక తప్పదు. మంజులమైన శైలి మనోహరమైన వర్ణనాశక్తి మాత్రము చాలునా మంచి 'నవల' రచించుటకు? చాలదు. సంవిధాన చమత్కృతి కావలయుఁగదా! అది రవీంద్రుని కథాసృష్టిలోఁ గొఱవడినదనుట సత్యదూరముకాదు.

రవీంద్రుని గద్యకథలన్నింటిలో నతని కనవద్య యశస్సు నార్జించి యీయఁగలిగిన గ్రంథము 'గోరా'యని యనేకుల యభిప్రాయము. కావున దాని కథాసారమును మనము గ్రహింపవలయును.

కలకత్తానగరమునం దిరువురు యువకులు హిందూ హితైషిణీ సభయనుసంస్థ' నొకదానిని నెలకొల్పిరి. దాని మూలమున వారు సంఘక్షేమమునకై పాటుపడుచుండిరి. వారిలోనొకఁ డాసభ కధ్యక్షుఁడు రెండవవాఁడు కార్యదర్శి. అధ్యక్షునిపేరు గౌరమోహనుఁడు. మిత్రు లాతని 'గోరా' యని పిల్తురు. అతఁడు గౌరాంగుఁడు. ఆఱడుగుల పొడవు.

వాఁడు. జమిలిమొముకవాఁడు: ఆతని ముష్టిబంధములు దృఢమైనవి. ఆతఁడు గంభీర కంఠస్వరమువాఁడు. అతని గొంతుకలోఁ గొంత మోటుతనమున్నది. ఆకస్మికముగా నాతని మొలుఁగువిన్నవారి కది యదటు కల్గించును. సభ కార్యదర్శి వినయభూషణుఁడు. ఇతఁడు నమ్రస్వభావుఁడు. కుశాగ్రబుద్ధి. ఇతనితోఁ జదువుఁగో గోరాయును సమానుఁడుకాఁడు. ఇరువురు సవయస్కులు, సఖులు.

గోరా తల్లి యానందమయి. ఆమె గోరాతల్లియని యామెను జూచినవారెవ్వరు ననుకొనరు. ఆమె పలుచని శరీరముగలది: సుకుమారమైన వదనమండలముగలది. ఆమె మోము తేజోమయమైనది. అందు బుద్ధిశక్తి తాండవించుచుండును. ఆమె శ్యామలాంగి. గోరాశరీరచ్ఛాయతో నామె మేనివన్నెకుఁ బోలికయే లేదు.

ఆనందమయిభర్త కృష్ణదయాళుఁడు. ఆయన యున్నతోద్యోగములఁ బనిచేయుచుఁ బశ్చిమదేశములన్నియుఁ దిరిగివచ్చెను. భర్తవెంట భార్యయు విదేశపర్యటనము చేసినది. వయసు ముదిరినపిదపఁ గృష్ణదయాళుఁడు లౌకికోద్యోగమునుండి విరమించుకొని శిష్టాచారసంపన్నుఁడై కాలము గడపుచుండెను. కాని యానందమయి జాతిభేదము పాటింపని పద్ధతిలో నడచుచుండెను.

కృష్ణదయాళునిది పరిశుద్ధసనాతనబ్రాహ్మణకుటుంబము. ఉద్యోగముచేయుచుండినకాలమును దయాళుఁడెట్లుఁ గడపినను, ఇప్పుడతఁడు మిక్కిలి నిష్ఠతో నాచారముతో మడితో దైవపూజాభక్తిశ్రద్ధలతో దినములుపుచ్చుచుండెను.

ఆతని కొక పూజామందిర మున్నది. దానిలోని కానం దమయి పోఁగూడదు. పెరిఁగిన గడ్డముతో, గైరికవర్ణ వసనములతోఁ జేత కమండలువు, పాదములఁ బాదుకలు తాల్చి వెలుపలికి వచ్చినప్పు డతఁడు మునివలెఁ జూపట్టుచుండును. పశ్చిమదేశములం దుండినపుడు మద్య మాంసాదులనైతము భుజించినవాఁడని ఆయన నెఱిఁగినవారు చెప్పికొందురు. కాని యిప్పు డాతనికి దేశమునందలి వైష్ణవ సన్న్యాసులు యోగులుమాత్రమే సంభాషణార్హులు. వారి పాదములఁబడి భక్తి ప్రపత్తులు చూపుటయే యాయనపని. నిగూఢములగు యోగమార్గములం దాయన కాసక్తి మెండు. వీనికిఁదో డతఁడు తాంత్రికసాధనము లభ్యసించుటకును మొదలుపెట్టినాఁడు.

తన తండ్రిగారికడకు వచ్చిపోవు పండితులతో గోరా వాదములు చేయుచుఁ దత్త్వవిచారణ చేయుచుండెడివాఁడు: దర్శనములఁ జదువుచుండువాఁడు. అతఁడేపని గాని సగము చేసి విడిచిపెట్టు స్వభావము గలవాఁడుకాఁడు: కూలంకషముగా భారతీయ వేదాంత శాస్త్రముల నవలోడనము చేయఁగలిగినాఁడు. హిందూమతమునం దతనికి గట్టి విశ్వాసము కుదిరినది. అతని మ్రోల హిందూమతము నెవ్వరేని అధిక్షేపించి రేని అతని హృదయము మండిపడును. వార్తాపత్రికలలో వ్యాసములువ్రాసి వారి యాక్షేపము లతఁడు ఖండించును. సమాధానములు వ్రాయును. పుస్తకములు రచించి ప్రకటించును. యుక్తులతో శాస్త్రపంక్తులతో నతఁడు మిషనరీల నెందఱనో వాదములలో జయించి హిందూమతప్రశస్తిని నిలువఁబెట్టెను. పిలకజుట్టుపెట్టుకొని బిళ్ళగోచీ ధరించి

యాహార విహారములం దతిజాగరూకుఁడై వర్తించి సనాతనాచారపరుఁడన్న గోరాయే యనుపేరు సంపాదింపఁగలిగెను. ఉపనీతుఁడై యున్నవాఁడగుట సంధ్యావందనాదుల నతి నియమముతో నెఱపుచుండెను.

వినయునకుఁ దండ్రి లేఁడు: తల్లి బాల్యముననే మృతి నందినది. చిన్నతనము నుండియుఁ గలకత్తాయందే యొంటరిగా నుండు పిన్న పెద్దలకుఁ దలలోనాలుకయై మెలఁగి మంచి సంపాదించుకొని, చదువుకొని పెద్దవాఁడయ్యెను. గోరాతోఁ జెలిమితోపాటు అతఁ డానందమయిమాతృప్రేమయు గడించెను. ఆనందమయి నతఁ డమ్మా యని పిల్చుచు నామెతో మిక్కిలి చనవున వర్తించుచుండెను.

కృష్ణదయాళుని చిన్ననాఁటి నెయ్యుఁడు పరేశభట్టాచార్యుఁడు. అతఁడు బ్రహ్మసమాజములోఁ జేరినవాఁడు. కాని పాషండబ్రహ్మసామాజికుఁడు కాఁడు. శాస్త్రచర్చలలో మంచిచెడ్డల నిర్ణయములో నతఁడు బ్రహ్మసమాజ నియమములఁ దదన్యముల, దనకుఁ దప్పుగాఁదోఁచినవి ఖండించుచుండును. ఆయన యింటికి వచ్చిపోవుచుండినవాఁడు బ్రహ్మసమాజ సభ్యులలో విద్వాంసుఁడని పేరెన్నికఁగన్న వాఁడొకఁడుండెను. అతనిపేరు హారానచంద్రనాగుఁడు. అందఱు నతని 'హారానబాబు' అని పిల్తురు. అతఁ డుపాధ్యాయవృత్తియందున్నవాఁడు. పత్రికాసంపాదకుఁడుగా స్త్రీ విద్యాలయ కార్యదర్శిగాఁ గొంతపలుకుబడి నార్జింపఁగలిగెను. రామాయణము భారతము భగవద్గీత మున్నగునవి హిందూమతగ్రంథము

లనియు బ్రహ్మసమాజసభ్యులు చదువరాదనియుఁగూడ వీని మతము.

గోరాకు హిందూమతమునెడ గాఢాభిమానమున్నను నిమ్నజాతి బాలుర యిండ్లకతఁ డనుదినము పోయి వారి కుపకారము చేయుచుండును. తన నీతి నియమములు జరుపుకొనుచుండును. ఎచ్చటనేని దౌర్జన్యము దౌష్ట్యము జరుగుట తనకంటఁబడునేని లేశమేని సహింపఁడు.

చేత దమ్మిడీయైన లేకయే, మార్గమధ్యమున ధార్మికుల యాతిథ్యము గ్రహించుచుఁ గొంతకాలము దేశసంచారముచేసి లోకానుభవము సంపాదింపవలయునని గోరా సంకల్పించుకొని, యొకనాఁ డాకస్మికముగాఁ బ్రయాణసన్నద్ధుఁడై యానందమయి కడకరిగి యామె యనుమతివడసి బయల్దేరెను. అతనితోఁబోవ సమకట్టిన వారిద్దఱు జబ్బుపడి నాలుగైదు దినములలోఁ గలకత్తాకుఁ దిరిగివచ్చిరి. విధివిరామములు లేక గోరా మొండిపట్టుదలతో నడచిపోవుచు దేశప్రజల కష్టసుఖములఁ జూచుచుండెను. పోయినచోట ఉపన్యాసము లిచ్చుట నీతులు గఱపుట గోరా కార్యక్రమము. దేశ మేస్థితియం దున్నదో గోరా పరిశీలించుచుండెను. జానపదజీవిత మర్మములు ధర్మములు గ్రహించుచుండెను, పల్లెటూళ్లలో సంఘీభావములేమి కతఁడెంతో విచారపడెను. ఒక గ్రామమునం దొక యింటికి నిప్పంటుకొనెను. స్త్రీ పురుషులు బాలబాలికలు పరువులెత్తి యేడ్చుచుకొని కర్తవ్యమూఢులై వర్తించిరి. ఆ జనపదమునకు సమీపమున జలాశయమే లేదు. విపత్ప్రతీకారము చేయు

నోపనివారిగతి యప్పట్టున విస్పష్టమయ్యెను. ధనవంతుల యిండ్ల యావరణములందును నూతులులేవు. త్రవ్వించుకొనవలయునన్న యాలోచనయే వారికిఁ దోఁచలేదు. అంతకుముందుకూడ నాయూరు పెక్కుతూరులు పరశురామప్రీతియై యుండినదఁట. అట్లయ్యు బావులు త్రవ్వించుకొనవలెనని గ్రామవాసుల చిత్తములకు స్ఫురింపలేదు. ఈ బుద్ధిమాంద్యమును గోరా కన్నులారఁగని మఱి మఱి పరితపించెను; తమ కర్తవ్యములను వారి జ్ఞప్తి కెలయించెను.

గోరా మఱియొకపల్లె కరిగెను. ఆ ప్రాంతమంతయు నీలిపంటలుపండించుకొను రైతులభూములతో నిండినది. అది యొక జమీన్దారుని యధీనమందుండిన పరగణా. రైతులకు భూస్వాములకు వివాదము లుప్పతిల్లిన పట్టున, వారికి హోరాహోరీ పోరాటములు జరుగుచుండెను. భూస్వాములు రైతుల పంటలను బలవంతముగాఁ దీసికొనిపోయిరి. కలహములు తిరుగుబాటులు మెండయ్యెను. రైతులసొత్తులకు స్త్రీల మానములకు రక్షణము శూన్యమయ్యెను. గోరా యీ శోచనీయపరిస్థితులఁగని యాగ్రహోదగ్రుఁడై పోలీసుద్యోగులతోఁ బ్రతిఘటించి రైతులపక్ష మవలంబించి భూస్వాముల నధిక్షేపించి బలవంతుల కోపతాపములకుఁ బాత్రుఁడయ్యెను. ఆంగ్లేయుఁడైన యొక మండలాధికారితో డీకొని పోలీసువారి దౌర్జన్యములకు గ్రామప్రజలు గుఱియై పీడింపఁబడుచున్నారనియు, ఆదురాగతముల వారింపనిచో నధికారుల నెదిరింప జానపదులను దాను బ్రోత్సహింపవలసి వచ్చుననియు గోరా యుద్ఘటించెను. నిరపరాధులను బట్టి ప్రభుత్వమువారు చెఱ

సాలలయందుంపఁగా బంధితులను వెలికీఁదీయ నతఁడు యత్నిం
చెను. ఒకనాఁ డమాయికులైన విద్యార్థులఁ గొందఱిని లాటీ
లతోఁ బోలీసులు కొట్టఁగా గోరా చూడఁదటస్థించెను.
విద్యార్థులొనర్చిన పొరపా టత్యల్పమైయుండఁ వారికిఁ బోలీ
సులు చేసిన ఘోరావమానమును గోరా సహింపక పోలీసు
వారిపై దుమికెను. ఆతని నాయకత్వమున విద్యార్థులు విజృం
భించి పోలీసుల నొక్కుమ్మడిఁ దుక్కుదుమారముచేసిరి. దీని
ఫలితముగా గోరాపై నొక పెద్దయభియోగము తార
సిల్లెను. ఆతఁడు నిర్బంధితుఁడయ్యెను. కేసు విచారణకు
రాఁగాఁ దనపక్షమున న్యాయవాది యక్కఱలేదని గోరా
పరసాహాయ్యము నిరాకరించినాఁడు. ద్రవ్యము వెచ్చించి
న్యాయవాదుల సాయము పొందలేని పేదలందఱు న్యాయము
సంపాదించుకొనలేక చెఱసాలలపాలై క్రమ్గి నశింపవలసి
నప్పుడు నేనొక్కండను గారాగృహమున కరిగినంత మాత్ర
మున నేమి మునిగిపోవును? చచ్చిననుసరే; నే నీ విచారణలో
నొక్క చినడబ్బయినను వెచ్చింప నని పట్టు పట్టినాఁడు. 'నిర్ధ
నుఁడైనవానికి న్యాయస్థానములో వ్యవహారమున న్యాయము
లేదా? జయము లేదా? సామాన్య మానవునికి, ద్రవ్యము
వెచ్చింపలేనివానికి న్యాయమే జరుగకున్న ఆ న్యాయస్థాన
ములు పేరునకుమాత్రమే యున్నవగునుగదా? కోర్టులు
న్యాయ విక్రయశాలలా? వేలకొలఁది జీతములు తీసికొను
చున్న యధికారులకే యర్థముగానిచట్టములున్నప్పుడు
నిర్భాగ్యులగు వాది ప్రతివాదుల పక్షమున వకీళ్ల నిమిత్త
మగుచున్న ధనవ్యయము దొరతనమువారు గదా భరింప

వలయు?' అని యాతఁడు తానే సొంతముగాఁ గేసు నడపుకొనెను. న్యాయమూర్తి విద్యార్థుల వయస్సును నేరము స్వభావమును యోజించి యైదుమొదలిరువదియైదు వఱకు బెత్తపుదెబ్బల శిక్షను వారికి విధించెను. గోరాకు ఒక నెల కఠినశిక్ష విధించి యతఁడు 'దయయుంచి నీకీ స్వల్పశిక్ష విధించితి' నని చెప్పి తన్ను దాఁ గీర్తించుకొనెను.

కారాగారవాసమును గోరా యోర్పుతో ననుభవించెను. ఎందఱో నిరపరాధు లెట్టితప్పులును గావింపకయే చెఱసాల కష్టము లనుభవించుచున్నట్లును, దానును వారితో సమసుఖదుఃఖముల పాలు పంచుకొనినట్లును అతఁ డానందమయికిఁ జెఱనుండి జాబు వ్రాసిపంపెనఁట. నెలదినముల కఠినశిక్ష గడచిపోయెను. గోరా బంధనిర్ముక్తుఁడయ్యెను. కారాగార మొకపాఠశాలగా గోరా భావించెను. అందలి తన నివాస మొకశిక్షాలాభముగా నతఁడు గ్రహించెను. అతని యనుచరులు మిత్రులు గుంపులు గుంపులుగాఁ గారాగార ద్వారమునఁ జేరిరి. అతని కంఠమునఁ బుష్పహారము వేయఁ బోయిరి. కాని దానికతఁ డంగీకరింపలేదు. అభినందన గీతము పాడ నారంభించిరి. వారి నతఁడు వారించినాఁడు.

వినయభూషణుఁడు గోరాకుఁ బ్రాణమిత్రుఁడగుట వాస్తవమే. కాని వారిరువురికి మతభేదములు తీవ్రమై యుండినవి. దానికిఁ గొన్ని నిమిత్త సందర్భము లేర్పడినవి.

కృష్ణదయాళుని పెద్దకుమారుఁడు మహిముఁడు. తండ్రి గౌరవమునుబట్టి దొరతనమువారి బొక్కసమునందతని కుద్యోగము లభించెను. ఆయన కూఁతురు శశిముఖి.

ఆ పిల్లకుఁ బెండ్లివయసు వచ్చెను. ఆ బిడ్డను వినయునకిచ్చి వివాహము చేయవలయునని మహిముని యిష్టము. వినయునికి గోరా స్నేహితుఁడైన కతమున గోరా మూలమునఁ దన సంకల్పసిద్ధి చేకూర్చుకొనవలెనని మహిముని యాశ.

ఇది యిట్లుండఁ బరేశుని తనయలయందు లలిత యను పేరుగలది వినయుని సౌశీల్య సౌహార్ద్రములకు ముగ్ధయై యతని బెండ్లాడ వలెనని మక్కువపడియుండెను. వినయుఁడు హిందూయువకుఁ డగుటచే నతఁడు తన కుమార్తెను బెండ్లాడఁ దగఁడని లలితతల్లి భావించి యాసంబంధమున కియ్యకొనలేదు. పానూబాబు ఆమె తత్త్వమునకు దోహదము చేయుచు ఆమెకు నానావిధములైన ప్రోత్సాహములు కల్పించుచుండెను. వినయుఁడు బ్రహ్మసమాజమునఁ జేరినఁగాని లలితపాణిని దాఁ బరిగ్రహించుటకు వీలుకాదయ్యెను. లలితా వినయులనడుమ వర్ధిల్లిన పరిచయము కారణముగా వారిద్దఱికిని గలిగిన సంబంధ మనివార్యఘటన మయ్యెను. ఆమెను వినయుఁడు పెండ్లాడకున్న ఆమె యావజ్జీవ మకారణాపవాదమునకు లోను గావలసియుండును. కావున వినయుఁడు బ్రహ్మసమాజములోఁ జేరి యామెను బెండ్లాడ నిశ్చయించెను. శశిముఖినిఁ జేపట్టుమని వినయుని గోరా నిర్బంధింపలేదు. బ్రాహ్మదీక్ష గ్రహించి వినయుఁడు లలితాపతి యయ్యెను.

గోరా హృదయము సంక్షుబ్ధమయ్యెను. భగవదారాధనమున శాంతిలభింపఁ జేసికొనఁ దలంచి యతఁడు పూజలకు ధ్యానమునకు నుపక్రమించెను. ఇది యిట్లుండ గోరా మిత్రులు పలువు రతనితో నాలోచించి కలకత్తా నగరము

నందొక ప్రాయశ్చిత్త కార్యకలాప మేర్పఱచిరి. అది ప్రజా సామాన్యమునకు ధర్మజ్ఞాన ప్రబోధము కలిగించు నిమిత్తము సంకల్పితమైనది. భారతదేశము దురదృష్టవశమున విదేశీయుల నిర్బంధమునఁ బరితపించుచుండినందున గోరాకూడఁ గారాగారవాస మభిలషించి యనుభవించె ననియు దేశభక్తుఁడైనయాతఁడు భారతభూమిలోఁ బ్రబలియున్న ధర్మదూరములైన యక్రమములకు ననాచారములకుఁ బ్రాయశ్చిత్తము చేసి దురాయి పెట్టుటకీ సమావేశ మేర్పఱచినాఁడనియు గోరా స్నేహితులు పత్రికలమూలమున నుపన్యాసముల ద్వారమున బహుళ ప్రచారములు చేసిరి. గోరా కీ ప్రచార మిష్టము లేకుండినను స్నేహితులను వారింపఁ జాలఁడయ్యెను.

ప్రాయశ్చిత్త సభాసంరంభము మహోత్సాహముతో వర్తిల్లెను. నిర్ణీతదిన మరుదెంచెను. ఈ ప్రయత్నము సంగతి కృష్ణదయాళుని వీనులుసోఁకెను. గోరా నాతఁడు పిలువనంపి 'నిజమేనా?' యని యడిగెను. 'ఔ'నని గోరా బదులుపలికెను. 'నేను బ్రదికియుండఁగా నిట్టి పని జరుగరా' దని కృష్ణదయాళుఁడు గద్దించెను. గోరా హృదయము సంతప్తమయ్యెను. గోరా యెన్నఁడును బితృశాసన ముల్లంఘించినవాఁడు కాఁడు. కాని యతఁ డానాఁ డెటులో బయలుదేరెను: గంగాతీరమున కరిగెను: గంగాస్నానముచేసి కార్యక్రమమున కున్ముఖుఁ డయ్యెను. పండితబృందము సమావిష్టమైయుండెను. కలాప మారంభము కానుండెను. అట్టితఱిఁ గృష్ణదయాళుఁడు రక్తవమనము కావించుకొన్నాఁడని వార్త వచ్చెను. తత్తఱముతో గోరా తండ్రిసన్నిధి కరిగెను.

కృష్ణదయాళుఁడు శయ్యపైఁ బరుండి యుండెను. గోరాను గూర్చుండ నియమించి 'నాకుఁ గాల మాసన్నమైనది. నేనింతకాలము దాఁచియుంచిన విషయము నీకుఁ దెలుపకున్నచో నాకు ముక్తిలేదు. ఇట్లే జరిగి పోవలయుననియు నీసంగతి నీకెఱిఁగింపవలసిన యావశ్యకములేదనియు నేననుకొంటినిగాని, అది యుక్తము కాదని తోఁచినది. బాబూ, నామరణానంతరము నీవు నాశ్రాద్ధకర్మ మెట్లాచరింతువు?' అనిముగించెను. గోరాయానందమయి వంకఁదిరిగి; యమ్మా! నీవుచెప్పుము. శ్రాద్ధముచేయుటకు నాకధికారము లేదా?' యని యడిగెను. అప్పటివఱకును నిశ్చేష్టయై యుండిన యానందమయి 'లేదు బాబూ, నీకధికారము లేదు.' అని బదులునుడివెను. అప్పుడు గోరాముఖమునుండి యగ్నిపర్వతమునుండి బయల్పడు అనలోచ్ఛ్వాసమువలె 'అమ్మా నీవు నాతల్లివి కావా?' యను ప్రశ్న వెల్వడియెను. ఆనందమయి హృదయము వ్రయ్యలయ్యెను. ఆమె కన్నుల నీరు వెల్లువలై ప్రవహింప 'బాబూ, కన్నబిడ్డకన్న నీవు నాకధికుఁడవే' యని పలుకఁ గృష్ణదయాళుఁడు రుద్ధకంఠముతో, 'అవి సిపాయీల తిరుగుబాటు దినములు. మీయమ్మ సిపాయీలభయముచేఁ బరుగెత్తుకొనివచ్చి యొకరాత్రి మాయింటఁ దలదాఁచుకొనెను. అంతకుముందే మీ తండ్రి యుద్ధమున మరణించినాఁడు. అతఁ డైర్లండు దేశీయుఁడు. ఆరాత్రియే మీయమ్మ మాయింట నిన్నుఁగని మృతినందెను. ఆనాఁటినుండి నీవు మాయింటనే పెరిఁగి పెద్దవాఁడవైతివి' అని తెలిపెను.

ఈ రహస్యము వెల్లడుటతో గోరా జీవితమంతయు నొక విచిత్ర స్వప్నముగా రూపాంతరము నందెను. ఆతనికిం దల్లి లేదు: తండ్రి లేఁడు: దేశము లేదు: పేరు లేదు: గోత్రము లేదు: దేవుఁడు లేఁడు: సర్వము లేదనుమాటయే. ఆశ్రయ హీనుఁడు: లక్ష్యహీనుఁడు: అంతయు శూన్యమే.

గోరా యనంతసత్యాంతరాళమునకు విసరి వేయఁ బడినాఁడు. సత్యమును సేవించుట కధికారియైనాఁడు. సత్య సంబంధమైన కర్మక్షేత్రము కళ్యాణక్షేత్ర మాతని యెదుట సాక్షాత్కరించినది ఇది కథ *

గోరాను పెంచి పెద్దవానిఁ జేసిన పుణ్యపురంధ్రి యానందమయి నిజముగా నానందమయియే. ఆమెహృదయ మమృతకలశము. సిపాయీల తిరుగుబాటు మహాభయం కరమైనది. అది ప్రథమభారతస్వాతంత్ర్యసమరము. దాని స్వరూప మీనాఁటికిని భారతేతిహాసములయందు సరిగాఁ జిత్రితముకాలేదు. కాని భయంకరమైనదనుటకు సందియము లేదు. ఎచ్చటఁ గాంచినను హత్యాకాండములే సంగరరంగములే విపత్ప్రబంధములే. ప్రాణభీతి లేనివారే లేరు. అట్టి సమయమున నొకనడికిరేయి వేళ నొకనిస్సహాయ ఆంగ్లేయ యువతి- ఆపన్నసత్వ- కృష్ణదయాళునియింట దాఁగి నది. ఆమెను దనయింట నిల్పుకొనుటకుఁ గృష్ణదయాళుఁడు దద్దఱిల్లినాఁడు. ఆనందమయి భర్తకుఁ దెలియనీయక యా యబలను నిండుచూలాలిని గొనిపోయి పసులసాలలో భద్ర

* శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల 'గోరా' రచనము నాధారము చేసి కొని యీ కథాసంగ్రహము నే నిట్లనువదించితిని.

షఱచినది. ఆరాత్రియే యీ దీన చారిత్ర మగశిశువును బ్రస వించి పరమపదించినది. అట్టి యనాథశిశువును ఆనందమయి పెంచినది. ఎంతో శ్రమించినది. ఎన్నో మందులతో నెన్నో మంత్రములతో నానందమయి యీ బాలుని బ్రతికించినది. ఆబిడ్డ నీశ్వరవరప్రసాదమని భావించినది. పెద్దవానిఁ గావించినది. సర్వవిపత్తులనుండి భారతమాతనే తాను రక్షింప వలయునన్న పట్టుదలగల దిట్టయైన గౌరమోహానునికిఁ దల్లి యైనది.

ఒకప్పుడు గాజీపురపు నివాసము పూర్తియైన పిమ్మట 'గ్రాండ్ ట్రంకురోడ్డు' మీఁద నొంటెద్దుబండిపై నెక్కి హిందూదేశ మంతయు సంచారముచేసి రావలయునని రవీంద్రుఁడు సంకల్పించినట్లే, గోరాకూడ దేశమంతయుఁ జూచి రాఁ గాలినడకమీఁద బయల్దేరినవాఁడు. రవీంద్రుని మనోరథము నెఱవేఱలేదు. కాని యీ కవీంద్రుఁడు గోరాను సృజించి వానిరూపమున దేశసంచారముచేసి వచ్చినాఁడు. రవీంద్రకవీంద్రుని యీ గ్రంథమున నాఁటిదేశాభిమానుల యుద్రేకపూరిత హృదయములు ప్రతిధ్వనించినవి. తాము బ్రహ్మసామాజికులమని తాము సనాతనాచార ధర్మానుసారులమని యనుకొనువారి పరస్పరసంఘర్షణములు వాద ప్రతివాదములు చర్చలు సిద్ధాంతములు రాద్ధాంతములు– ఇవి యీ గ్రంథమున మెండుగా నిండియున్నవి. ఎన్నియున్నను దీనిలో సంవిధానముమాత్రము కుంఠితమే. కథావయనము పలుచఁబాఱిపోయినది. కథనడక కుంటువడినప్పుడు, చర్చలు గొప్పవైనను వర్ణనలు మంచివైనను విసుపుగొల్పక మానవు.

రవీంద్రుఁడు గోరావంటి యద్భుతవ్యక్తిని సృజించిన పిమ్మట, ఆతని స్వరూపము నిండార వికసింపఁజేయఁగలిగిన సంవిధానము కుదిర్చియుండినఁ బ్రపంచ సాహిత్యమునకు మకుటాయమాన మై రాజిల్లఁగల మహాకథారత్న ముదయించియుండెడిది.



శ్రీ

# గురుదేవ చరిత్రము

## దశమోల్లాసము

## IV

### [రవీంద్రుని తత్త్వదృష్టి]

రవీంద్రుఁడు తత్త్వవేత్తయని పలుకు పండితు లనేకు లున్నారు. అతఁడు కవీంద్రుఁడే కాని తత్త్వవేత్త కాఁడను విజ్ఞు లున్నారు. ఇంచుమించు విశ్వమంతయుఁ బర్యటనము కావించినవాఁడు రవీంద్రుఁడు: ఎంతో వాఙ్మయము చదివిన వాఁడు: ఎన్నో జాతుల సంస్కృతిఁ బరిశీలించినవాఁడు. అతఁడు చిత్రకారుఁడు: కలాభిజ్ఞుఁడు. నానాదేశ చరిత్రములను భిన్నజాతి జీవితములను జదివి యాకళించుకొని యేతద్ద్వివిధవాతావరణములు కావలసినపుడెల్లఁ బునరుజ్జీవింపఁ జేసికొని తనవశము కావించుకొని యనుభవింపఁ గలిగిన మహిమ యాతనికే కలదు. 'తటముల నధిగమించి యెడతెగక ప్రవహించు గానమువంటి దతని రచనము' అని † యరవింద యోగీంద్రుఁడన్నాఁడు.

రవీంద్రుని లేఖిని యనేక మార్గములలో నఖండ నైపుణ్యముతో నప్రయత్నముగా విహరించినది. అతని

† "His work is a constant music of the over-passing of borders." Golden Book of Tagore.

దృక్పథ మతివిశాలమైనది. * "ప్రపంచ కార్యక్రమమున మానవప్రయోజన మేమి? మానవుఁ డేమి సాధింపఁ బూనినాఁడు? ఆతని లక్ష్యమేమి? అను జిజ్ఞాస మనకు రేకెత్తినచో మనము చేయవలసిన పనియేమి? మానవ చరిత్రమును మన మామూలాగ్రము పరిశోధింప వలయును. ప్రత్యేకించి యక్బరు పరిపాలనమునో గుజరాతురాష్ట్రచరిత్రమునో ఎలిజబెత్తు రాణి ప్రవర్తనమునో పరిశీలింతుమేని మన యైతిహాసిక చారిత్రిక విషయ పిపాసమాత్రమే తీఱును. అక్బరు చక్రవర్తి, యెలిజబెత్తురాణి – వీరుపకరణమాత్రులే. చరిత్రలో నంతర్వ్యాపినిగాఁ బ్రవహించు గంభీర పరమార్థము మానవుని జయాపజయముల ద్వారమున ఫలోన్ముఖ మగుచున్నదని, తనలోని భిన్నాంశముల సమీకరణమువలన మానవసంఘ ముత్తరోత్తరము మహాత్మ్యప్రస్థితిని బరమోచ్చదశను బొందుటకు శ్రమించుచున్నదని వివేకముగలవాఁడు గుఱుతింపఁ గలుగుచున్నాఁడు. అట్టివివేకి వ్యక్తులను బృథక్కరించి విమర్శింపక, మానవసంఘ మెట్లు వృద్ధిక్షయముల నొందుచు భిన్నత్వమున సామరస్యము సాధించుటకు యత్నించుచున్నదో, ఆత్మను స్వయముగా సంపూర్ణముగా సాక్షాత్కరింపఁ జేసికొనుట కేసరణిఁ గృషిచేయుచున్నదో కనిపెట్టి వెల్లడింప సమకట్టును. వివేకముగలవాఁడు యాత్రిక సమూహమునుజూచి తృప్తిపడి యింటికివచ్చునా? గర్భగృహములోని కరిగి దేవతామూర్తిని దర్శించి యర్చించి

* 'విశ్వభారతి' నుండి యుద్ధృతమైన రవీంద్రుని విశ్వసాహిత్య తత్త్వము.

గదా మరలును! విశ్వసాహిత్యక్షేత్రమున మానవుఁడు తన యంతరాత్మలోని యానంద మేవిధముగా నభివ్యక్త మొనర్చుచున్నాఁడు? పాపిగా భోగిగా సంయమిగా మనుజుఁడు భిన్న పరిస్థితులయందు వివిధావస్థలలోఁ దన్నుఁదా నెట్లు వ్యక్తమొనరించుకొనుచున్నాఁడు? నానా రూపములలో నైకపరిణామములలోఁ దనపరమార్థము సాధించుటకై మానవుఁడెట్లు తపించుచున్నాఁడు? అను విషయము గ్రహించుటయే కర్తవ్యము. విశ్వముతో మానవుఁ డెంత మాత్రము సాయుజ్యము పొందఁగల్గుచున్నాఁడు? అను నీ యంశము వెలికిఁదీయుటకై మనము విశ్వసాహిత్యము మథింపవలయును.'' — అని చెప్పినవాఁడు రవీంద్ర కవీంద్రుఁడు.

రవీంద్రుఁడు స్థాపించిన ప్రత్యేక తత్త్వసిద్ధాంత మెద్దియులేని మాట నిజమే. కాని పరమార్థములకు మూలసూత్రములైన రహస్యములనుగూర్చి రవీంద్రుఁడు వెల్వరించిన యమూల్య రమణీయభావములు పెక్కులుగలవు.

రవీంద్రుని హృదయము విశ్వమయము. అతనిది కళావిదుని వాక్కు. కాని యతనిదృష్టి తత్త్వవేత్తది. అతని చూపులో జగత్తంతయు నఖండరూపముదాల్చినది.

రవీంద్రుఁ డుపనిషత్కల్పకప్రసూనపరిమళములఁ దనివితీఱ మూర్కొన్నవాఁడు. ఆసౌరభము లాయన మేధలో నిండ్లుకట్టుకొని వాసముచేసినవి. వైష్ణవకవిప్రకాండుల గానపీయూషముతో ఆయన హృదయకలశము నిండిపోయినది. నవీనభౌతికశాస్త్రపరిశోధనలవలన వెల్వడిన విజ్ఞానమ్యాయన సోఁడు ముట్టినది. ప్రకృతి సౌందర్యము నాతనికన్నులు

చూఱఁగొనఁగల్గినవి. ఈ సంపత్తియంతయు రవీంద్రుని కబ్బుట కతని యాభిజాత్యమే మూలమనవచ్చును. ఆతని వంశము కళలకు నిలయము; తత్త్వ జిజ్ఞాసకుఁ దావై వన్నె కెక్కినది: సారస్వతోపాసనకు నికేతనమై నెగడినది.

రవీంద్రుఁ డుదయించు నాఁటికి ఠాకూరువంశమున భావస్వాతంత్ర్యము తలసూపినది. ఆకుటుంబపు సనాతన మతావలంబకులగాంభీర్యము నవీనవిజ్ఞానవైశద్యముతో వియ్యమందెను. రవీంద్రుని బాల్యమునందే వంగదేశము జాతీయతా సంచలనముతో నుప్పొంగుచుండెను. దేశసేవో ద్యమములు సంఘసంస్కరణ ప్రచారములు బ్రహ్మసమాజ సంరంభములు వేయిరూపములు ధరించి విస్తరిల్లుచుండెను.

ఈయుగజీవితమున కనువైన భావములుగల యుపని షద్భాగములను దేవేంద్రనాథుఁడు వెలికిఁదీసి తన శిష్యబృం దమునఁ బలుకుబడికిఁ దెచ్చెను. కఠోపనిషత్తు దేవేంద్ర నాథుని కత్యంతప్రీతిపాత్రమైనది. 'తత్త్వబోధినీ' సభయను పేరుతో వర్ధిల్లిన వైజ్ఞానికసంస్థను నెలకొల్పిన దాతఁడే. 'తత్త్వబోధిని' యను పత్రికనుగూడ నడిపినవాఁడామ హాన్యుఁడే.

తొలుదొల్తఁ దండ్రిగారి తాత్త్వికజీవితమే రవీం ద్రునికి విజ్ఞానమార్గదర్శకమయ్యెను. బ్రహ్మసమాజ స్థాప కులలోఁ బ్రముఖుఁడగు రామమోహనరాయలు మొదటి నుండియు రవీంద్రునిహృదయము నాకర్షించినవాఁడు. పాశ్చాత్య విద్యా విజ్ఞానములను భారతీయులు నిరాకరింపఁ దగదని ఘోషించినవాఁడు రామమోహనుఁడు. అవ్వాని

నిరాకరింతుమేని మనదృష్టి ఖండదృష్టిగా నుండునని తెలియఁజెప్పిన వివేకి రామమోహనుఁడు. భారత సంస్కృతికిఁ బరిపూర్ణత కలుగవలయునన్న మనము పశ్చిమఖండవాసులతో నెయ్యము నెఱపి వారి మంచిని గ్రహింపవలయునని యుపదేశించిన దేశికుఁడు రామమోహనుఁడు. ఈ యుపదేశములు తలఁదాల్చి మెలఁగినవాఁడు రవీంద్రుఁడు.

శ్రద్ధాభక్తులతో రవీంద్రుఁడు ఋగ్వేదము నధ్యయనము చేసినాఁడు. ఉపనిషద్విద్యయం దతఁడు మితిలేని యభిమానాదరములు నెఱపినాఁడు. ఈశోపనిషత్తు శ్వేతాశ్వతరోపనిషత్తు ఇవి రెండును రవీంద్రుని కత్యంత ప్రీతిపాత్రములు. శ్వేతాశ్వతరోపనిషదర్థమునే యావిష్కరించు గీతికలు రవీంద్రుని 'నైవేద్యము'లో నున్నవి. కఠోపనిషత్తునఁగల 'భయాదస్యాగ్ని స్తపతి' లోని భావమును దెలపించు పద్యము 'నైవేద్యము'నఁ గానఁబడుచున్నది. 'గీతాంజలి'లో రవీంద్రుని యనుభూతికి లక్ష్యమైన పరమాత్మ యుపనిషద్గేయుఁడైన భగవంతుఁడే. ప్రేమపరిపూర్ణుఁ డయ్యును జీవకోట్ల శిక్షించుచు శాసించుచు విశ్వము పరిపాలించు పరమేశ్వరు నే కదా యుపనిషత్తులు నిరూపించుచున్నవి! ఋషులలో గానమును గుప్తముగావించుకొనినవాఁ డతఁడే! రవీంద్రుఁ డుపనిషద్విద్యాభ్యాసము చేయుచు జీవితము గడపినాఁడు.

వంగవైష్ణవ కవిపుంగవుల ప్రభావముగూడ రవీంద్రునిపైఁ బ్రసరించినది. జయదేవ చండీదాస విద్యాపతుల గీతములు రవీంద్రుని మది నాకర్షించినవి. కాని యా గీతముల

నతఁడు కవితాదృష్టితో ననుభవించినాఁడు. తాత్త్విక దృష్టితోఁ జూచినవాఁడుకాఁడు.

వైష్ణవకవుల కవితాచ్ఛాయలు రవీంద్రుని ప్రేమ కవిత్వమునఁ గానవచ్చును. శృంగార కవిత్వమున రవీంద్రుఁడు వైష్ణవకవుల దారిఁద్రొక్కలేదు. రవీంద్రుని దృష్టిలో ముక్తికిని ప్రేమకును భేదములేదు. మోక్షము ప్రణయ స్వరూపమే.

రవీంద్రుని కవితలోఁ బ్రస్తావింపఁబడు ప్రణయ మొక విధముగా వైష్ణవమత సంప్రదాయ ప్రతిపాదితయగు 'హ్లాదినీ' శక్తియే.

రవీంద్రుని చిత్తప్రవృత్తిలో గౌతమబుద్ధుని భూత దయాశాంతిశక్తులున్నవి. తాఁ గృతార్థుఁడగుట కుపనిష ద్విద్య యుపకరించు ననుమాట నిజమేకాని లోకము నుద్ధరించుటకు బుద్ధునిత్యాగ మవసరమని రవీంద్రుని విశ్వాసము. బౌద్ధమత ముపదేశించు దయాస్నేహములు విశ్వభూతహితత్వము మానవుఁ డార్జింపలేకున్న సుఖములేదని యతఁడు శాంతినికేతనమున విద్యార్థుల కెన్నోసారు లుపన్యసించెను.

ప్రేమరూపములగు భక్తిప్రపత్తులఁ బ్రచారముచేయు వైష్ణవుల బోధలకును దయారసభరితములైన హృదయములతో లోకోపకారము కావించు బౌద్ధుల యుపదేశములకును గేంద్రమొకటే. దుఃఖదూరమైన శాంతిస్థానమే యది. రెంటికిని సర్వసమత్వము మూలసూత్రము. విశ్వమునఁగల సకల జీవజాలములపట్ల మైత్రి పెంపొందింపుమనిగదా బుద్ధభగవంతుని యుపదేశము!

రవీంద్రుఁడు పాశ్చాత్యమన స్తత్త్వ శాస్త్రముల మాత గ్రంథములఁ గూలంకషముగాఁ జదివినాఁడు. ప్రాచ్యప్రతీచీ సంస్కారసమ్మేళనముననే ప్రపంచమునకు ముక్తి కలుగునని యతని విశ్వాసము. యంత్రముల బలమున వస్తువు లుత్పత్తి చేసి ధన మార్జించి ఐహికాభ్యున్నతి చేకూర్చుకొను పరిశ్రమములందు నిమగ్నులై యుండుట పాశ్చాత్యుల పారమార్థిక చింతా శూన్యతకు హేతువు. పురాతన సంప్రదాయదాస్యము ప్రాచ్యఖండవాసుల యధోగతికిఁ గారణము. ఈ రెండు తెగలవారును దమ యీ లోపములు పూరించుకొననిదే వారికభివృద్ధి లేదని రవీంద్రుఁడు తన కవకాశము లభించి నపుడెల్ల నుభయులకు విసువు లేక యుద్బోధించినాఁడు. మానవజాతి యభ్యుదయము విభాజ్యమైనది కాదు. సాధింప వలసిన యఖండఫలము లోకకల్యాణ మొకటే. ఇది రవీంద్రుని తత్త్వము.

రవీంద్రుఁడు తత్త్వవేత్తయనుటకు సందేహమేమి? ఆతఁడు బ్రహ్మజ్ఞాని. ఆతని తత్త్వవేత్తృత్వము చూపుదారిని బట్టి కవియైన రవీంద్రుఁడు నడచిపోవు చుండును. అతఁ డానందమయుఁడు: మానవత్వముతో నేకీభావమందిన భగవ ద్వైభవమును గలారంగమునకుఁ దెచ్చిన మాంత్రికుఁడు. బాహ్యమానోజ్ఞకమున కాంతరంగిక సౌందర్యమును సంధింపఁ గలిగిన కళాభిజ్ఞుఁడు. ఆతఁడు దైవీసంపత్తికి మూర్తులు కల్పించి కళాపీఠుల విహరింపఁ జేసినాఁడు. భూమికి స్వర్గమునకు రాకపోకల నిమిత్త మతఁడు వంతెన నిర్మించుకొఁ గలిగినాఁడు.

"ఒక్క తిమిరస్రవంతి నాయుల్లమందుఁ
గలదు - నా కన్నులం దొక్క కాంతితటిని
గలదు - నాపాట స్వర్గసీమలకుఁబోవుఁ
గాని నాయూట మర్త్యలోకమ్మునందె!"
అని యా మహనీయుని మాట. ‡
"గణమునకుఁ గట్టువడఁగ రాగమ్ము కోరు,
రాగమై రేఁగ ఛందస్సు వేగిరించు,
పరుగులిడ నెంచు రసము రూపమ్ముఁ దాల్ప,
రూప మాశించు రసములోఁ గాపురింప."
అని గానమొనర్చిన కవి రవీంద్రుఁడు. §

పరమేశ్వరుని యాజ్ఞానుసారమే యనంతకోటి బ్రహ్మాండములు వర్తించుచున్నవి. శివుని యాన లేనిది చీమ యైనను జలింపదు. నియంతయే లేకున్న సాధ్యమగునా విశ్వవ్యవహారము?

"♦ ఇల క్రుంగకుండ, వారా
సులు మేరలు మీఱకుండ, సూర్యా
దులు దారులు తప్పకుండ.......
..............................".

తమ నియమములు తాము పాటించునా? రవీంద్రుని నాటికలయం దొకదానిలో నొక పాత్రముఖమున అతఁడు "దేవుఁడే లేకున్న సృష్టిలో ఈ క్రమము ఈ నియమము ఈ

‡ From 'Purabi of Tagore.— a portion rendered by me into Telugu.

§ From 'Utsarga of Tagore.

♦ అభినవ తిక్కనార్యుని సుమతి సూక్తి.

నీతి యెట్లు సాధ్యపడును ?" అని ప్రశ్నించినాఁడు. ఇంకొక చోట † రవీంద్రుఁడు 'విశ్వచరిత్రముఁగని యది గ్రుడ్డినడవడి యని భ్రమింపరాదు. సర్వము భగవంతుని యిచ్ఛాధీనము" అని వక్కాణించినాఁడు.

రవీంద్రుఁ డద్వైతుల నిర్గుణ పరబ్రహ్మము నభిమానించి యుపాసనచేయలేదు. సగుణోపాసనమే యతనికిష్టము. అనంత కల్యాణగుణ విశిష్టుఁడగు పరమపురుషుఁడే యతని దేవుఁడు. 'పరమపురుషుఁ డెవ్వఁడో యాతని నే నెఱుఁగుదును.' అని పలికిన వాఁడతఁడు. 'వేదాహమేతం పురుషం మహాన్తమ్' అని కదా శ్రుతిసూక్తి. అట్లని యతఁడు నిర్గుణ తత్త్వము నిరాకరింపలేదు. కాని యతఁడు కవియగుటచేతఁ దన హృదయము నభివ్యక్తము చేయుటకు రూప నామములాశ్రయింపక తప్పినదికాదు. మూర్తిని లక్ష్యముగా నిల్పుకొని పూజించువాని కామూర్తి బంధమగుచున్నది. కవి కట్లుగాదు. తన భావమున నొకయాకృతి కల్పించుటతోఁ గవికి వెంటనే యాంతరంగికమయిన బంధనిర్ముక్తి లభించుచున్నది; హాయి దొరకుచున్నది; ఆనందము ప్రాప్తమగుచున్నది. భక్తుఁడు పూజకుఁడు: కవి భావుకుఁడు.

చక్కెర తీపిని రుచిచూచి యనుభవించి మానవుఁడానందించునేకాని, తాను చక్కెరయైపోవఁ గోరుకొననట్లు రవీంద్రుఁడు బ్రహ్మానంద మనుభవించువాఁడేకాని బ్రహ్మమే కావలయునని యాశింపలేదు.

† Personality. Pages 61, 62.

సృష్టిప్రళయములు సర్వేశ్వరుని లీలలు. భగవంతుని బహిర్వ్యాపారము సృష్టి. అయన యంతర్వ్యాపృతి ప్రళయము. స్వతంత్రుఁ డతఁడు. కేవల స్వతంత్రుఁడే యైనచో, సృష్టిప్రళయరూపమైన వ్యవహారము పెట్టుకొనక హాయిగా నూరకుండి యుండును. హాయి సోమరితన మనిపించుకొనునో యేమో! సోమరియై యుండలేదు. సృష్టిస్థితిలయరూపమైన వ్యాపారములో దిగి సంసారియైనాఁడు. బంధములు తెచ్చి పెట్టుకొన్నాఁడు. జీవకోట్లు సృజించుచున్నాఁడు. తా సృజించిన మనుష్యులకుఁ దన స్వాతంత్ర్యములో భాగము పంచి యిచ్చినాఁడు. తన సత్యస్వరూపము తనయంశమైన జీవుఁడు సాక్షాత్కరింపఁజేసికొన్నప్పు డుబ్బి మెచ్చుకొని యానందమున మునిఁగి తేలుచున్నాఁడు. ఈ యభిప్రాయములు రవీంద్రుని గీతాంజలిలో 'జ్ఞేయ' గీతములలోఁ గానవచ్చును. వైష్ణవజీవగోస్వామి సూచించిన అచింత్య భేదాభేద తత్త్వమియ్యదియే.

పరమాత్మకు జీవాత్మకుఁగల సంబంధబాంధవ్యముల సత్యానుభూతియే తత్త్వజ్ఞానమని రవీంద్రుని హృదయము. ఇదియే ప్రేమ. ఒకవిధముగా నది బంధము. ఇంకొక దృష్టిలో ముక్తి. ఈ ప్రేమలో రూపరసములకు శక్తిసౌందర్యములకు రవీంద్రుఁడు సామరస్యము సాధింపఁగలిగినాఁడు.

రవీంద్రుఁడు సత్యశివములతోఁ గూడిన సౌందర్యమునుపాసించినయోగి. కళ శివుఁడు మనుజునకొసంగిన యుడుగర. భగవంతుఁడు తాను వినోదముగా మానవుఁడనువాద్యము మీఁదఁ దన పాటలు వాయించుకొని తన్మయుఁడగుచున్నాఁ

డని యొక గీతికలో రవీంద్రుఁడన్నాఁడు. పరమేశ్వరుఁడు విశ్వకళావేత్త. ఆయనవంటి కళావిదుఁ డింకొకఁడున్నాఁడా? ఆతనిరీతిగల కవి మఱియొకఁడు కలఁడా? శ్రుతి యీశ్వర స్తుతికై ప్రవృత్తమై పరమేశ్వరుని 'కవి! కవి!' యని యెన్నేసారులు ప్రశంసించినదఁట. విశ్వకావ్యకర్తగదా యతఁడు! భగవంతుని గానము విశ్వవ్యాప్తమై యున్నది. ఆతఁడు జగదేకగాయకుఁడు. ఆతనిప్రతిబింబమైన మనుష్యుఁడు చేయు కళాసృష్టియందును భగవంతుని విభూతి ప్రతిబింబించుట తగునని రవీంద్రునిమతము. మానవప్రకృతిలోని మహనీయత కళాముఖమున వికసింపవలయునని యతని ప్రతిపాదనము. మనుష్యుని స్వరూపచిత్రణమే కళకుఁదగిన విషయమని యతనివిశ్వాసము.

ఉచితస్థానమున సుఘటితమైన నియమాంచితమైన ధర్మజగత్తును సుందరముగా సృజించినప్పుడే కవి కృతార్థుఁడగుచున్నాఁడు. తజ్జగత్సౌందర్యమే రసికభోగ్యము. నియమరహితమై ధర్మదూరమైన వస్తుసృష్టికిఁ గవి కారకుఁడయినప్పు డది సరసులకు భోగ్యమగునా? ఒకకవి మానవనీతికి విరుద్ధమైన లోకము సృజించునేని అది మనవాసమునకు యోగ్యమగునా? కాదు. కళాభ్యుదయమునకు నైతికాభివృద్ధితో నవినాభావసంబంధమున్నది. నిర్దుష్టమైన కళవలన సంఘనీతి వర్ధిల్లును. సౌందర్యమే సత్యమను సూక్తి ప్రసిద్ధము. అనఁగా సృజనశక్తిగల సాధుకళావిదుని చేతిలోఁబడి, వాని శయ్యలో మెలఁగి, యతని హృదయకమలగంధముతో వెల్వడిన సౌందర్యము సత్యమగునని యర్థము. అట్టిసౌందర్యము

నుపాసించువారికి శివము మంగళము కరతలామలకములు. పవిత్ర హృదయులు కానిరచయితల చేతులనుండి యవతరించిన కృతుల పూఁతమెఱుఁగులకు భ్రమసి మోహించి యదే సౌందర్యమని దానిలో మునిఁగిపోవు టనర్థదాయకమని సూచించుటకే రవీంద్రకవీంద్రుఁడు క్రొత్తగా లోకోత్తరమైన 'ఊర్వశి' ని సృజించినాఁడు. దేవదానవులు మందరగిరితో క్షీరసాగరము మథించినప్పుడు దానినుండి యమృతమే కాదు, హాలాహలముసైత మావిర్భవించినది. రంభాదులలోఁ బ్రముఖమైన యూర్వశియు నుద్భవించినది. ముప్వురు పాలకడలినుండి పుట్టినవారగుట, నొకచేతవిసము రెండవచేత నమృతముఁగొని దుగ్ధపాథోధినుండి యూర్వశి వెల్వడినట్లు రవీంద్రుఁడు వర్ణించినాఁడు. ఆమె యలోకసామాన్య సౌందర్యవతి. 'పదునాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ బేరుఁబెంపునుగల నీరజాక్షి'. మహేంద్రుని యాస్థానిలో నర్తకి.

ఆయుజ్జ్వలాంగి దివ్యమంగళ విగ్రహమును దన ముందఁ బ్రత్యక్షము చేసికొని రవీంద్రుఁడామెను బలుకరించినాఁడు. నాయనువాదమిది. ఏమన్నాఁడు? ఇదిగో, వినుఁడు.

తొడిమలేని పూవువడువున వికసించి
నావు నీకు నీవె! నాకుఁదెల్పు
మిందువదన యూర్వశీ, యెప్పు డేనాఁడు
పరువమొప్ప విరియఁబారినావు?

పొడమినావె పాలకడలి గర్భమునందు
అల్ల తొలివసంతమందుఁ గాంత!
కుడికరమున నమృతకుంభంబు — డాచేత
విషఘటమ్ము పూని వెడలినావె?

ఊర్వశీ, యెన్నఁడేని నీ వుండలేదె
ముగ్ధవై పాలపాపవై, పుట్టినపుడె
నిత్యతారుణ్య వర మబ్బెనే? వచించి
నంత రాలునె నోటిముత్యాలు బోటి!

బాలవై యున్ననాఁడు నీలాలయమున
లీల ముత్యాలతోడ రత్నాలతోడ
నాడుకొనువేళ నీకెవరమ్మ చెలులు?
మెలఁగితివె నీవొక ర్తవు కలికిమిన్న!

హారి మణిదీప దీప్త శుద్ధాంతమందుఁ
బవడపుం బాన్పుమీఁద నీప్రక్క నెవరు
కుదురుకొని పండుకొని నిన్ను నిదురబుచ్చి
రోలి సాగరవీచికల్ జోలపాడ?

అమలమైన యాననాంబుజాతమ్ముపై
మందహాసరుచులు చిందులాడ
నీవు హాయిగదుర నిదురింపఁగాఁ జూచి
ప్రేమ నోమినట్టి వెలఁది యెవరు?

మేలుకాంచి యొనిమిషమ్మున నిష్ట
పమ్ముమీఁద దృష్టిఁ బఱపినావొ.

యప్పుడె నీకు నిందు యౌవనంబు లభించె
నా, యనూనశోభనతకుఁ దోడు?

ఊర్వశీ, పెక్కుయుగములనుండి నీవు
జగతికిం బ్రేమపాత్రవై నెగడినావు:
లేరు లావణ్యవతులు నీలీలవార,
లింక నిను మీఱఁగలిగిన యింతులెవరు?

మునివరేణ్యులు తమ ధ్యానములను మాని,
కట్టుబాటులు నీతులు కట్టిపెట్టి,
తమ తపస్సులు నీ పదాబ్జముల చెంత
నర్పణమొనర్చినార లోయన్నుమిన్న!

నీ కటాక్షపుసోఁకు తాఁకినంత జగత్త్రి
యమునఁ దారుణ్యంపు దిమ్ముఁగమ్ము;
కైపుగల్పించు నీ కమ్మని తావిని
విరఁజిమ్ము గ్రుడ్డి తెమ్మెరలు దెసల;
మకరందమానిన మధుపమ్మువలెఁ గవి
ప్రేమార్తిఁ గూరి పరిభ్రమించు;
ముగ్ధచిత్తములు మోహముల వెఱ్ఱి సంతోష
ములుగల్గి చరియించుఁ బురుషజాతి;

నీవుమాత్రము కాళ్ళయందియలు గల్లు
గల్లుమనఁ జీర జీరాడఁగాఁ దటిల్ల
తాలఘుత్వంబుతోఁ బోదు వోలెతాఁగి,
యెమ్మెలనుజూపి, కన్నులఁ దుమ్ముచల్లి,

ఓ వరవర్ణనీ, సురల యోలగమం దతివేలసమ్మదా
ప్లావ పవిత్ర చిత్త శతపత్రముతో నటనం బొనర్చుచో,
నీ వొక మంగళాంగ కమనీయ తరంగమవై యెసంగినన్
దీవర పాటుతో జలనిధి న్నెలరేఁగిన భంగసంఘముల్

మైవడి నాట్యమాడి పొరలంబడి బోర్లఁబడె న్నదే తమిన్:
భూవనితాంశుకాంచలసమూహము మంజులసస్యమంజరీ
జీవశిఖాంతరస్థమయి చిందిలె: నీ గళసీమలోని ము
క్తావళినుండి చుక్కగమి గ్రక్కునరాలె నభోంతరంబునన్:

ఓ వనితామణీ, నరునియుల్లము మైమఱచెం దటాలునన్:
లో వెదచిందు నాళములలోఁగల రక్తమునల్పె నృత్యమున్,
దైవతసార్వభౌముని సదస్సున లాస్యమునట్లు చేయుచో
భావిని, బద్ధమైనది భవన్మణిమేఖల యప్పు డద్దిరా!

రవీంద్రుని యూర్వశి నవలోకించితిరిగదా! ఆమె మోహన మంత్రాధిదేవత. మూర్తీభవించిన దివ్యసౌందర్యము. ఇంద్రియనిగ్రహము సాధించినవారికి సౌందర్యోపాసనము రససిద్ధిని హస్తగతమొనర్చును: అమృతత్వము ప్రసాదించును. జితేంద్రియులు కానివారి కది యనర్థదాయకము. కావుననే రవీంద్రుని యూర్వశి యొకచే సుధాభాండము వేఱొకచే విషఘటము కొనివచ్చినది. రవీంద్రుని హృదయముఁగోసి గూఢ రహస్య మిది.

శాక్తమతముపట్ల రవీంద్రుని కభిమానము సున్న. కాళికాపూజ జంతుబలి మున్నగునవి రవీంద్రుఁ డిష్టపడినవి కావు. ఆయనతత్త్వమున కవి గిట్టవు. అతని స్వాంతము

ప్రేమమయము. కావున శక్తిపూజ నతఁడు దరికిరానీయ లేదు. దేనిలో నిజమైన మానవత్వము భద్రపఱుపఁబడియున్నదో, ఆమందసము తలుపు తీయు తాళపుఁజెవి ప్రేమయే కాని శక్తి కాదని యతనిమతము. మందబుద్ధులకుఁ ప్రేమ దౌర్బల్యముగాఁ దోఁపవచ్చును. కాని వివేకులకు నిక్కముగాఁ ప్రేమయే విక్రమము. త్యాగము ప్రేమలో నంతర్భూతమై యున్నది.

మనుష్యుఁడు సంఘములో నుండవలసినవాఁడు. ఒంటరిగా జీవితము క్షణకాలమేని గడపలేఁడు. పరుల సాయము లేకున్న నరుని మనుగడ జరుగదు. ఒరులు తనకవసరము. ఒరులకుఁ దా నవసరము. తనమేలులో మనుష్యుఁడు తోడివారలకుఁ బాలు పంచిపెట్టవలయును. తనకిష్టములేకున్నను నరుఁడు పరులకుఁ దోడుపడవలయును. ఘనీభవించిన మనుష్య స్వార్థపరత్వము మంచుగడ్డవంటిది అది కరఁగి ప్రేమమయ ప్రవాహమై మానవసంఘ సత్యసముద్రమునఁ గలసిపోవలయును. ఈ పరమార్థమునే రవీంద్రుఁడు తన 'నిర్ఝరస్వప్న భంగము'న వెల్లడించినాఁడు.

రవీంద్రుఁడు కర్మసన్న్యాస మంగీకరింపఁడు. ఆయన కర్మలో మునిఁగి ముక్తి సాధించు సాధకుఁడు. 'స్వర్గమనఁగా నెక్కడనో లేదు: అదియిదే. నాయందే కలదు – నా మేనిలో నాప్రేమలో నాసుఖములో నాదుఃఖములో. నరజన్మ మెత్తుట కన్న అధికమైన యదృష్టమున్నదా!' యని రవీంద్రుఁడొక గీతములో † గాన మొనర్చినాఁడు. పురుషుఁడు సంసా

† Balaka.

రముఁనుండి తప్పించుకొని పోవుటలో గొప్పయేమున్నది? సంసారియై యుండవలయును. నిండుబ్రదుకు బ్రదుకవలయును, కృతార్థుఁడు కావలయును. ఇది రవీంద్రుని దృఢవిశ్వాసము.

మనుష్యుఁడు భగవంతుని యనుగ్రహము నర్థించువాఁడగుట ధన్యుఁడు. ప్రపంచమునఁ దన యునికి నాదరించి ప్రేమించువాఁడగుట మఱింత ధన్యుఁడు. ఐహికాముష్మికములు రెండును మనుజుఁడు మన్నింపఁదగినవి. దివికై యఱ్ఱులుసాచి, భువిపట్ల మనము సవతితల్లిచూపు చూడరాదన్నాఁడు రవీంద్రుఁడు. ఒకగీతము§లో నేమనుచున్నాఁడో వినుఁడు.

దివ్యదీపిక వెల్గు నర్థించి, దానిఁ
బడసినాఁడను నేను ధన్యుఁడను గానె?
ఇలను నాయునిక్కిఁ బ్రేమింపఁగలిగినాఁడ
నౌర, నేను కృతార్థుండనైతిఁగాదె!

ఈ యాశాస్యమునే యతఁడు అనేక స్థలముల ననుసంధానమొనరించి యున్నాఁడు. సన్న్యాసినై వైరాగ్యము నాశ్రయించి పడయుముక్తి నాకేల? ఈ మృణ్మయ పాత్రముతోనే, యాపీయూషము తప్పక త్రావుదును. బాహ్యేంద్రియఁ ద్వారములను నేనెన్నటికిని బంధింపను. వర్ణసౌందర్యము చూచి, సంగీతము విని, పరిమళము నాఘ్రాణించి, యనుభవించు నానందమధ్యముననే బ్రహ్మానందము నాకు భోగ్యమగుఁగాక!" అని యాతఁడు తన 'నైవేద్యము' న విజమనోరథమును లక్ష్యమును వెల్లడించినాఁడు.

---

§ Chaitali - (my rendering)

రవీంద్రుఁ డొక సూర్యాస్తమయము గని పరవశుఁడై యనుభవించిన యానందము నిట్లు వెల్లివిరియించినాఁడు:- అపరాంబుధిపై సంధ్యాదేవి మెల్లఁగా నడుగులు వేయుచు, నిలువ నెలవులేని నీడలఱెక్కలచే నొక్కుమ్మడి గాలిని గంపింపఁజేయుచున్నది. రత్నములవంటి నక్షత్రముల కాంతులతో రాజిల్లు ప్రశాంతికిరీటము నాకాశ మాదల ధరించినది. నిద్రాసముద్రముమీఁద స్వప్నములు నాట్యమొనర్చుచున్నవి. అంభోజకదంబము లుషస్సుపై విశ్వాసముఁ గోలుపోయి చీకాకుపడి, యాశ లేని తమ రేకులను ముకుళింపఁ జేయుచున్నవి. అట్టితఱి గుట్టుగా గూఁడు వెడలిన పిట్టయొకటి నడక జాడలు లేని స్వర్గమార్గమున కెగిరి యాత్మగీతము నన్వేషించుచున్నది. ఆ యన్వేషమే యిట్లు ఛందోబద్ధమైనది.

§ చరమవారాశిపై సంధ్యామహాదేవి
యల్ల నల్లన నడయాడు వేళ,

---

§ "When the evening steals on western waters
Thrills the air with wings of homeless shadows,
When the sky is crowned with star - gemmed silence
And the dreams dance on the deep of slumber,
When the lilies lose their faith in morning
And in panic close their hope-less petals,
There is a bird which leaves its nest in secret,
seeks its song in trackless path of Heaven."
(Modern Review of September 1921

దీనికి మాగురువరేణ్యులు 'సాహిత్యస్థాపకులు' 'అభినవతిక్కనేతి' బిరుదులు శ్రీ దుర్భాకసుబ్రహ్మణ్యశర్మగారు మృత్యుంజయనాఁడు కావించిన యనువాదము పై సీసము.

నెలవేది తెరులనీడలు భయద్రుతములై
కరువలి తెరలలోఁ గలియువేళ,
రవిపునర్దర్శనోత్సవ నిరాశంబులౌ
కనులు పద్మిని మూసికొనెడివేళ,
గాఢంపుఁ గూర్కు పెన్గడలి పై భాగాన
స్వప్నముల్ లాస్యంబు సలుపువేళ,
ఉడుమణి కిరీటకలితమై వ్యోమసీమ
శాంతరసమొల్కు వేళఁ, బంజరము వీడి,
యకలితపదాంకమైన దివ్యపథమందు
వెదకికొను నాత్మగీతంబు విహగమొకఁడు.

పృథగ్జనుల చర్మచక్షువుల కనుదినమును గోచరించు సాధారణ సంధ్యాసమయము రవీంద్రుని దివ్యదృష్టి కెట్టియద్భుత రూపాంతరము నొందినదో చూచితిరిగదా! సంధ్యాసుందరి సాక్షాత్కరించినది: విష్ణుపదము శాంతిరసము చిల్కరించినది: పులుఁగు నిలువలేదు: తన యానందగీత మెందున్నదో ఆ యంతరిక్షమున కుల్లంఘించినది: స్వర్గమార్గమున కెగిరి యాత్మానందగీత మరయఁబోయిన యీ పరమహంస మెవ్వరందురా? రవీంద్రుఁడే!



శ్రీ

# గురుదేవ చరిత్రము

## దశమోల్లాసము

## V

### (ఉపసంహారము)

రవీంద్రుఁడు నవభారత సారస్వతమునకు గురుదేవుఁడు: ప్రాచీదిగ్దేవత హృదయ తత్త్వము పశ్చిమఖండవాసుల కెఱుఁగఁజేసిన రాయబారి. పుట్టువుతోడనే యతఁడు కైతమును పుట్టకట్టుకొని వచ్చినాఁడు. ఆయనయందనురక్తుని ప్రణయోద్రేక మున్నది: శిశువు చిత్తనైర్మల్య మున్నది. భక్తునిపారవశ్యము, జ్ఞానిస్థితప్రజ్ఞత యా మేధావిలో మేళవించినవి.

రవీంద్రుఁడు జడపదార్థములలోఁ జైతన్యము చూపఁగలడు: ఎడారులలో సరోవరములు సృజింపఁగలఁడు. కనఁబడని భగవంతుని మన కీ దృశ్య ప్రపంచములోనే యతఁడు చూపినాఁడు. దూరమునం దెందోయున్న దేవుని మన దగ్గఱకుఁదెచ్చినాఁడు: మనలఁ గృతార్థులఁ జేసినాఁడు. మానవజాతి శాశ్వతకృతజ్ఞత కతఁడు పాత్రుఁడగుటకు దీనికన్న మిన్నయగు యోగ్యత మఱి యేమికావలయును?

ఆంగ్లభాషలో 'విక్టర్' అను పదమునకు విజయుఁడని యర్థము. ఫ్రెంచి రచయితలలో నగ్రశ్రేణికిఁ జెందిన విజ్ఞాని యగు 'విక్టర్‌హ్యూగో' పేరు వినని నేఁటి విద్యార్థు లుండరు. ఆఙ్గ్లేయకవిగా నప్రతిమానప్రతిష్ఠఁగన్న 'టెన్ని

సన్' మహాశయుఁ డొకమాటు 'విక్టర్ హ్యూగో' ను గూర్చి రచించిన పద్యగుచ్ఛములో

"నాటక రచనలోనే కాదు, కథాసృష్టిలోఁగూడ నీవు విక్టరు వేసుమీ! శూన్యాశామేఘముల పదుగులు, శుష్కభయజీమూతముల పేకలు సంధించి చిక్కని నేఁత నేసి, కథావయనరంగమున విజయశంఖము పూరించినవాఁడవు: మనుష్యుల బాష్పముల కధీశ్వరుఁడవు: శిశువత్సలుఁడవు: వయసు ముదిరినవాఁడవైనను వన్నెతఱుఁగని యైంద్రజాలికకవితావిద్యాఖద్యోతుఁడవు"

అని ప్రశంసించినాఁడు. ఈ ప్రశంసావాక్యములన్నియు రవీంద్ర కవీంద్రుని కన్వయించుననుట సత్యము.

రవీంద్రుని లేఖినిలో స్పర్శవేధి కలదు. అతఁడు పట్టిన దేదికాని బంగారము కానిది లేదు. § అతఁడు కవిమాత్రుఁడు కాఁడు: వాగ్గేయకారకుఁడును. అతఁడు శబ్దముల శాసించినాఁడు. తన్మూలమున లోకశంకరుఁ డైనాఁడు. ఇప్పటికిఁ గవీశులెందఱో పుట్టిరి: కావ్యసృష్టి కావించిరి; కాని రవీంద్రునిలో నొక విశిష్టత కలదు. అతఁడు మైత్రీదేవతనుగూర్చి తీవ్రతపస్సుచేసినాఁడు: ఆమెను భూమికిఁ గొనివచ్చినాఁడు: సువర్ణమయమైన గుడికట్టి యామెను దానిలో నెలకొల్పినాఁడు: ఉర్విలోఁగల సర్వఖండముల యాత్రికులు జాతి మత వర్ణభేద నిరపేక్షముగా నిరంతర మీ పుణ్యక్షేత్రము సేవింప వీలు కలిగించినాఁడు రవీంద్రుఁడు. నిఖిలజనోపాస్యమైన వరివస్యారహస్యము నేల నాలుగుచెఱఁగులకు వ్యాపింపఁ

§ Nullum tetigit, quod non ornavit. (Nothing did he touch, which he did not adorn.)

జేసినాఁడు. ఎవ్వఁడే భాష మాటాడిననేమి? ఏ మూల వసించిననేమి? ఏకులమువాఁడైననేమి? ఏవన్నె తోలుదాల్చిననేమి? అందఱము విశ్వకుటుంబమునకుఁ జెందినవారమే యను తృప్తి తుష్టి పుష్టి మన మనసులు నిండించు కవిత్వమీతనివలె మనకిచ్చిపోయిన కవులెందఱున్నారు?

శాంతినికేతనవాసులకు విశ్వభారతీవిద్యార్థులకు మాత్రమేకాక కళోపాసకుల కందఱకు రవీంద్రుఁడు గురుదేవుఁడుగా జగద్విశ్రుతుఁడైనాఁడు. అన్నిజాతుల యాదరాభిమానములు చూఱగొని, విశ్వసాహిత్య పరీక్షక సమితివారి మన్నన వడసిన మతిమంతుఁడని మాత్రమేకాదు రవీంద్రునికిఁ బ్రపంచము జోహారులర్పించినది. దైవి యెవ్వరి వాగ్దేవిరో, భూతదయ యే మనుజులమతమో, సత్య మేమానవుల వ్రతమో, అహింస యేపురుషుల భూమిలోఁబుట్టెనో, సర్వజనసౌఖ్య మే దేశీయుల యాశాస్యమో, యాభారతీయుల సనాతనసంస్కృతికి నవయుగప్రతినిధియని రవీంద్రుని లోకము జయపెట్టినది.

ఆర్థిక సంపత్తిలో పాటిభూరమణులతోఁ దులతూఁగ లేకున్నను భారతమాత రాధాకృష్ణునివంటి వేదాంతిని, బోసువంటి భూతత్త్వజ్ఞుని, రామనువంటి భౌతికశాస్త్రవేత్తను, గాంధివంటి మహాత్ముని, రవీంద్రునివంటి కవీంద్రుని, దనకిచ్చినదని లోక మాకల్పాంతము కృతజ్ఞతాంజలితో నీ తల్లికి ధన్యవాదము లర్పింపదా!

ప్రతిసంవత్సరము సారస్వతరంగమునఁ బ్రపంచమున ముకుటాయమానముగు పదవి నాక్రమించు మహనీయునికి

నోబెలు బహుమాన మీయఁబడుచునే యున్నది. రవీంద్రుఁడీ బహుమతి నొందినపిదప నలువదిమంది వాఙ్మయధురంధరులీ నలువదియేండ్లలో నీయులుపా సంపాదింపఁగలిగిరి. కాని యిలలోఁగల యక్షరాస్యులలో రవీంద్రునికున్న పలుకుబడి మఱొక్కని కేల రాలేదు? ఆయన కవితాగుణమైన విశ్వ జనీనత మఱొక్కని రచనలో లేకపోవుటయే కారణము.

ఉదాత్త శాంత గంభీరస్ఫూర్తికి నెలవై, యాధ్యాత్మిక తేజస్సౌందర్యమునకు నిలయమైన రవీంద్రుని శుంభ స్ఫూర్తిదర్శనసంపత్తికి నోఁచుకొనిన వారికిమాత్రమే యామహనీయుని యూర్ధ్వప్రకాస్తి యనుభవైక వేద్యము. ఆ పుణ్యపురుషునికి సమకాలికులముగా జననమంది, దేవుఁ డిచ్చిన కనులుండి, చూడ నవకాశముండి, యాయనకను కలియదృష్టమునొందని భారతీయులు నిజముగా దురదృష్ట వంతులే!

అక్షరములనుబట్టి శీలనిర్ణయముచేయు విజ్ఞులున్నారు. అట్టివారిలో † మేల్బంతిగా విఖ్యాతికెక్కిన ఫ్రెంచిమహా శయుఁడు క్రెపిలో జామిన్ పండితుఁడొకనాఁడు § జర్మను విద్వాంసుఁడగు కీసర్లింగు కడ కరిగి, మీయొద్ద మహాత్ములు వ్రాసిన యక్షరములున్నవా? ఉన్నచో నాకొక్కటిమాటు చూపింతురా? యని యడిగెను. వెంటనే కీసర్లింగు తన చెంతఁగల పెద్దల వ్రాఁతలెన్నో చూపించెను. ఆవ్రాఁత లెవ్వియు జామిన్ పండితునికిఁ దృప్తిగలిగింపలేదు. కాని

† Cripieux-Zamin, the great French graphologist.
§ 2 Hermann Keyserling

రవీంద్రుఁడు తనకువ్రాసినలేఖలు కీసర్లింగు తెచ్చి చూపించి నంతనే, 'ఆహా, దివ్యాక్షరములు! మంగళాక్షరములు! ఈ రమ్యాక్షరములతో సరితూఁగునవి కలవా? యూరపు ఖండపునరుజ్జీవనపుమహోజ్జ్వలదశ ప్రారంభమైనది మొదలు నేనిట్టి వ్రాఁత చూచి యెఱుఁగను,' అని యా వృద్ధుఁడు-రవీంద్రునికన్న నెన్నో యేండ్లు పెద్దవాఁడు-జామిఁక పండితుఁ డానందబాష్పములు విడిచినాఁడట!

చిత్రలేఖకుఁడు గాఁగూడ రవీంద్రుఁడు ప్రసిద్ధుఁడే. మాటలతోఁగాక, గీతలతోను వన్నెలతోను భావములు వెలువరింప నేర్పుగలవాఁడని, పదములతో వాకొనరాని విషయములుగూడ రవీంద్రుఁడు బొమ్మలు గీచి రంగరించి, తన్ముఖమునఁ జూపఱ యంతరంగముల కెక్కింపఁగలఁడని చిత్రకళావిశారదుల యభిప్రాయము.

చీఁకటిసముద్రముమీఁదఁ బ్రేమజ్యోతితరంగములు చిత్రించి మనకిచ్చి 'యివిగో, యివి మీరు చూచి, మీ నేత్రామయములు కుదుర్చుకొనుఁ' డని చెప్పిపోయినవాఁడు రవీంద్రుఁడు. ఆయనమాటలు పెడచెవిఁబెట్టి, తెప్పలువ్రాల్చి, తెలివకుండుకొని మనది తుదివఱకు గ్రుడ్డిబ్రదుకే.

రవి కానలేనివానిని గవి కాంచునఁట. ఇఁకఁ గవీంద్రుఁడైన రవీంద్రుని కసాధ్యమేముండును? అట్టి మహాపురుషుని దివ్యకథాతీర్థము సేవించితిమి. మన కింక మంగళముల కేమి కొదవ?

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---